# ఆంధ్రవిప్లవం

నందూరి వెంకటేశ్వరరావు.



వెంకటేశ్వర్ అండ్ కో.,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,
గుంటూరు.

# కృతి

* * *

నా

ఆత్మయొక్క మారుపే

శ్రీమతి జ్యోతిష్మతి

కి

* * *

గ్రంధకర్త.

# స్వవిషయం



ఎన్నిసారులు ఎంతటి భక్తిశ్రద్ధలతో ఆలోచించి చూచినా, ఆంధ్రమహాసభనూ, తద్వారా ఆంధ్రజాతినీ ఉత్తేజితం చేయడానికి నే నీ పుస్తకంలో నివేదించిన పద్ధతి అక్రమమైనదనిగాని, దీనికన్న ఋజుమార్గ మింకొకటి వున్నదని గాని, నాకు స్ఫురించడం లేదు. ఆంధ్రాభ్యుదయానికి అత్యుత్తమమని పలువురు మిత్రులతో కలిసి నేను విశ్వసించే ఈ సిద్ధాంతాన్ని ఉచితమైన ప్రచారంలోకి తెచ్చే నిమిత్తం ఒక తెలుగు వారపత్రికను స్థాపింపదలచి, ఈ చిన్ని గ్రంథాన్ని వెలువరింప సాహసిస్తున్నాను. కనుక దీని మూల్యం కొంచె మధికమని తోచినా, దానిని అల్పమైన దీని పుటలసంఖ్యతోగాని, పేలవమైన దీని రచనావిధానంతో గాని సరిపోల్చక, ఇది స్థాపింప నుత్సహించే సంస్థయొక్క పవిత్ర ఆశయాన్ని గమనించి మా యుద్యమానికి తోడ్పడగలరని ఆంధ్రమహాజనులకు వినయపూర్వకమైన మా మనవి.

వీటిలో కొన్ని ప్రకటింపబడిన వ్యాసాలు. కాని, ఎక్కువభాగం ఇంతవరకూ ప్రపంచాన్ని చూడనివి. మొదటి తరగతి వాటిని కొద్దిపాటి సంస్కరణలతో ఇందులో

స్వ వి ష యం

చేర్చాను. రెండవరకప్పువైనా ఒక్కసారిగా వ్రాయబడినవి కావు. కనుక పుస్తకం మొత్తంమీద, మిగిలిన లోపాలకు తోడు, కాలదోషంపట్టిన అంశాలూ, పునరుక్తి ప్రమాదాలూ పాఠకులకు కన్పించవచ్చు : మన్నింప ప్రార్థన.

దీని ప్రచురణ సందర్భంలో నాకనేకవిధాల తోడ్పడిన శ్రీ గొల్లపూడి సూర్యప్రకాశరావుగారికీ, ఇతరమిత్రులకూ నేను నిత్యకృతజ్ఞుడను.

గ్రంధకర్త.

# విషయసూచిక



## వి ష య సూ చి క





శ్రీ

# ఆంధ్రవిప్లవం



## (౧) నివేదన

ఈ గ్రంథంయొక్క ఆశయం కొందరు పెద్దలకు రుచించకపోవచ్చు. కాని ఆంధ్రయువకహృదయమంతా దీనికై తపిస్తోందనడం అత్యుక్తికాదు.

"సమీపభవిష్యత్తు"లో ఏర్పడబోయే ఆంధ్రరాష్ట్రం భారతరాష్ట్రసమాఖ్యకు మకుటాయమానమై ప్రకాశించవలెనన్నా, అంతర్జాతీయవ్యవస్థల్లో భారతీయత్వాన్ని కోల్పోని ఆంధ్రుడి ప్రతిభాతిశయం ప్రజ్వలితం కావలెనన్నా, ఆంధ్రవిజ్ఞానకళాసంస్కృతుల కీర్తిచంద్రికలు దిగంతవ్యాప్తి పొందవలెనన్నా, ఈ వ్యాసావళిలో సూచితమైన న్యాయం ప్రాతిపదికగా అనుసరింపబడడం అనివార్యం.



# (౨) రాష్ట్రీయత

ఆంధ్రభూభాగం వైశాల్యంలో దానికి రెండింతలు, దీనికి మూడింతలు—జనాభాలో దీనికి రెట్టింపు, దానికి పదిరెట్లు — ఆదాయంలో దీనితో తుల్యం, దానికన్న అధికం—ఇక నైసర్గికసంపదలో, పారిశ్రామిక అవకాశాల్లో భావి వాణిజ్యవిస్తరణమార్గాల్లో, వాటిలో వీటిలో నేమిటి, సమస్తంలో, అంతులేదు!

ప్రజలా? దాతృత్వంలో దానకర్ణులు, పాండిత్యంలో కళాప్రపూర్ణులు, దేశభక్తిలో అపరశివాజీలు, త్యాగశక్తిలో కేవలం గాంధీమహాత్ములు!

వీరి రాష్ట్రవాంఛ అందామా? దానిని గురించిన అన్నితీర్మానాలూ, అన్నిసభల్లో ఏకగ్రీవామోదము!

ప్రయత్నమా? 33 ఏండ్లనుండి! దాని రజతోత్సవం జరుపుకొన్నాం, స్వర్ణోత్సవం సమీపిస్తున్నాం!

మనది అపారమైన ప్రతిభ, పరిమాణంలేని ప్రజ్ఞ, వెలలేని సౌభాగ్యం,—ఓ, ఇక నేమి? స్వరాష్ట్రానికి మనం కాకపోతే ఇంకెవ్వరు అర్హులు?

ఇదీ, మనవాదన.—

సరే, బాగుంది. అయితే యీపాటికి రాష్ట్రనిర్మాణం ఎన్నడో జరిగివుండవలసిందే?

సమీపభవిష్యత్తులో అది జరుగనున్నదా లేదా అనికాదు ప్రశ్న; ఇక కొద్దికాలంలో, ఎవరిప్రభావం వల్లనైతేనేమి, మనరాష్ట్రం నిర్మింపబడవచ్చుగాక; లేదా సర్. విజయ విజ్ఞప్తిని త్రోసిపుచ్చక, ఆదరించి, అమాత్యత్రయం ఈపాటికే ఆంధ్రరాష్ట్రం నిర్మించి వుండవచ్చుగాక; కాని మన ఆంధ్రోద్యమంయొక్క అసలైన ఆదర్శాన్ని పూర్తిగా అవగాహన చేసికొన్న దూరదృష్టిపరులు చూచేది అదికాదు!

అన్ని యోగ్యతలూ ఉండి, అందరి ఆశీస్సులూ ఉండి, ఇంత దీర్ఘకాలం సిద్ధాంతనిర్వచనఘట్టాలలోనే మసలుతూ ఉండవలసిన అగత్యం ఆంధ్రుల కెందుకు పట్టిందా, అన్నసందేహం వివేకవంతులైన ప్రతివారికీ తప్పక కలుగుతుంది. ఏమంటే, మన ఉద్యమవికాసానికి మూలాధారమైన ఒక అంశం ఈప్రశ్నయొక్క సమాధానంమీదనే ఆధారపడివుంది.

అయితే ఏమిటి? మనకు ప్రతిభలో తక్కువ లేదు; ప్రయత్నంలో లోపంలేదు; వాంఛలో అసంపూర్ణత లేదు;- మరి ఆ అదృష్టరేఖకు నోచుకొనకపోవడానికి కిటుకు ఎక్కడుంది? ఇన్ని అష్టైశ్వర్యాలూ వుండి అల్లుడినోట ఈ 33 ఏండ్లకు మించిన శనికి కారణం ఏమిటి?

తిరిగి ఇంకొక్కసారి ఆలోచిద్దాం—పై యోగ్యత లన్నీ నిజంగా మనదగ్గిర వున్నవా? ఉంటే కేవలం అవేనా మనకు కావలసినవి, లేక వేరే కీలకప్రాయమైన దింకేమైనా వుందా?—

ఒక్క జనసంఖ్య లెక్కలు చూపి మనం రాష్ట్రాన్ని సాధింపదలపడం ఊహాసౌధాలు నిర్మించడం! మేకలజనాభా ఎంత వున్నప్పటికీ, పులిని భయపెట్టి, జీవించడానికి తమకు కూడా గల హక్కును అవి స్థాపించలేవు!

లేక కేవలం భూవైశాల్యమే రాష్ట్రసిద్ధికి ప్రమాణమైతే, మన గుంటూరుజిల్లా అంతవున్న ఆల్బేనియా స్వతంత్ర రాజ్యమైనపుడు, మనకు రాష్ట్రమే కాదు, ఒక పెద్ద సామ్రాజ్యంకూడా వుండవలసింది.

ఆర్థికసంపదే రాష్ట్రనిర్మాణానికి ఆధారభూతమైతే, మనకళ్లముందర పూర్వాపోశన పట్టిన సింధు, ఒరిస్సాలు మనమీద సొడ్డు వేయగలిగి వుండేవి కావు.

లేక గాఢవాంఛాపూర్వక తీర్మానాలు మాత్రమే సంకల్పసిద్ధికి అమోఘాస్త్రాలైతే, మనకు స్వరాష్ట్రమే ఏమి కర్మం, భారతావనికి స్వరాజ్యంకూడా లభించి వుండేది! ప్రపంచమంతా తెల్లవారే సరికి కలియుగం కృతయుగంగా మారి వుండేది!

దీనినిబట్టి ఈజన, ధన, స్థలాది అర్హతలు ప్రత్యే కంగాగాని, సమిష్టిగాగాని నిరర్థకాలని కాదు చెప్పడం. ఈ హంగులన్నీ మన దగ్గిరవుండటం వాస్తవమైకూడా మనకు రాష్ట్రం 33 ఏండ్లు అందని ద్రాక్షపండులాగ కనుపించడం చూస్తే, కేవలం ఇవి మాత్రమే సరిపోవని స్పష్టమౌతోంది.

ఇక, ప్రయత్నమా?—అది ఒక ప్రత్యేక అధ్యాయం!

ఈ విషయం ఎంత ప్రముఖమైనదో, అది మనలో అంత అపోహని కల్గించింది.

మన ప్రయత్నం 33 ఏండ్ల కాలపరిమితి గలది అని సగర్వంగా చెప్పుకోవడం మనకు ఆచారమై పోయింది! కాని ఇంత దీర్ఘకాలం సాధించి రావలసివుండటంలోనే మన ప్రయత్నంలో ఎక్కడో బలహీనత వున్నదనే అర్థం ఇమిడి వున్నట్లు మనం గ్రహించుకోలేక పోతున్నాం! "33 ఏండ్ల ప్రయత్నం" అన్నది మనం గర్వింపవలసింది కాక, ఒక విధంగా సిగ్గుపడవలసిన మాట అని మనకు స్ఫురించడం లేదు!—

మనం మన పరాజయానికి అనేక కారణాలు చెప్పుకోవచ్చు:

సైమన్ కమిషను వచ్చినపుడు మనం దానిని బహిష్కరించకపోతే, మనకు రాష్ట్రం వచ్చివుండేదే అనీ—

(కాని తప్పుడు సాక్ష్యాలుచెప్పి, అసభ్యకార్యాలు చేసేనా మనం రాష్ట్రం సంపాదించేది? వేరే రాజమార్గం ఏమీ లేదూ?)

బ్రిటిషువారు సింధుని విడదీసింది హిందూ మహమ్మదీయ విభేదాలని అభివృద్ధిపరచడానికేగాని, సింధీయులకి మనకన్న రాష్ట్రార్హత ఎక్కువ వున్నట్లు గుర్తించి కాదనీ—(అయి వుండవచ్చు: కాని దాదాపు ఇటువంటి వుద్దేశ్యంతోనే చేశారని చెప్పబడ్డ బెంగాలు విభజనని ఈ బ్రిటిషు వారిచేతనే ఉపసంహరింపబడేటట్లు చేసినశక్తి ఏమిటి? అది నిజంగా మన ఆంధ్రులలో వున్నదీ?)

బొబ్బిలి, దేశపాండ్యప్రభృతులు లండను వెళ్లినపుడు గట్టి యత్నంచేయలేదనీ,—(యదార్థంలో ఈ విషయం ఎంత ప్రస్తావించకుండా వుంటే అంత మనకే గౌరవం! కారణం, మన ప్రతినిధులే మనపని సరిగాచేయనపుడు తప్పెవరిపై యుంటుంది?)

ఆత్మ సంతృప్తికొరకు ఇటువంటి కుకారణాలెన్నైనా చెప్పుకోవచ్చు. కాని సవిమర్శకంగా, నిష్పక్షపాతంగా ఆలోచిస్తే మనం ఒక భయంకర సత్యాన్ని మాత్రం గుర్తించక తప్పదు; అది ఏమంటే,

ఇంతవరకూ మనం త్రికరణశుద్ధిగా ఆంధ్రరాష్ట్రం కొరకు ప్రయత్నించింది బహు తక్కువ!

## రాష్ట్రీ య త

మన 33 ఏండ్లప్రయత్న మన్నది వట్టి బూటకం. అది ప్రయత్నంకాదు; కొన్ని అసమర్థనీయ సిద్ధాంతాలతో మన ఉద్యమనాయకులు చేసిన వ్యర్థకాలక్షేపం!

కాంగ్రెసు సజీవమై వున్నపుడు తను చైతన్యం పొందుతూ, కాంగ్రెసు పదచ్యుతి పొందినపుడు తను అదృశ్యమవుతూ, మన ఆంధ్రోద్యమం కాంగ్రెసు మహారథానికి కట్టబడిన ఒక ఉపశకటమై పోయింది!

ఈ ధోరణిలో మనం 33 సంవత్సరాలు కాదుగదా, 33 శతాబ్దాలు ప్రయత్నించినా ఫలితం ఒకటే! రావలసిన రీతిగా మనకు రాష్ట్రంరాదు. ఒక వేళ వచ్చినా అది సుస్థిరమై నిలవదు!

ఈప్రయత్నం మనకు రాష్ట్రీయత కలిగించే ప్రయత్నం కాదు!

దాని ప్రకృతే వేరుగావుంటుంది. దాని నాయకత్వం ఇంకొకరి నిగ్రహానుగ్రహాలమీద, ఆపదసంపదలమీద, ఆధారపడక, స్వయంశక్తిమీది విశ్వాసంతో, పరాకెరుగని పట్టుదలతో, స్వతంత్రమై, సజీవమై ప్రవర్తిస్తూ వుంటుంది.

కాంగ్రెసు, లీగు, మహాసభ మొదలైన ప్రముఖ సంస్థలలోవున్న గొప్పదనమే అది! వాటి నాయకత్వాలు వేటికవి స్వతంత్రమైనవి. వాటి కార్యక్రమాలు ఒకదాని కొకటి పోలికలేనివి. వాటి ప్రయత్నాలు అఖండమైన ఏకా

గ్రత గలవి. బయట యుద్ధాలు వచ్చినా, మహార్ణవాలు పొంగినా, అవి తమపట్టు వీడడంలేదు; తమ ప్రయత్నం మానడంలేదు. ఆశయ సిద్ధికొరకుచేసే ఈ మహాయజ్ఞంలో తాము జయమైనాపొందాలి, లేక ఆహుతి అయినాకావాలి, అన్నట్టు పనిచేస్తున్నై. అవి నేడు గాకపోతే రేపైనా వాంఛాసాఫల్యం పొందడంలో ఆశ్చర్యంలేదు.

కాని అటువంటి నాయకత్వం మన ఆంధ్రరాష్ట్ర సందర్భంలో ఏదీ?—

" ఇది నా రాష్ట్రం; దీని నిర్మాణాభ్యుదయాలు నా జీవితంయొక్క ఏకైక ప్రధానసమస్య!

"ఇది నిర్మింపబడి, భారతరాష్ట్ర సమాఖ్యలో అగ్ర పీఠ మలంకరించేవరకూ నాధ్యానాన్ని అన్యాక్రాంతం కానీను. నేను నా ప్రయత్నంనుండి విరమించను.

" నా కృషి ఫలించేవరకూ ఇక నాకు నిద్రపట్టను.

"దీనికై నా సర్వశక్తులూ, సర్వసంపదలూ ధార పోస్తాను.

"అవసరమైతే ప్రాణమర్పించి, ఆ ఆదర్శప్రాయమైన ఆంధ్రరాష్ట్రాన్ని సృష్టిస్తాను"—అన్న నాయకత్వమేదీ మన కింతవరకు?

అటువంటినాయకత్వమే సుస్థిరమైన ఆంధ్రరాష్ట్రానికి నిజమైన పునాది!

రాష్ట్రార్హత

ఆ పునాది వున్నపుడే భవననిర్మాణానికి మన అసలైన అర్హత!

అది లేకనే మన ఇతర అర్హతల ఘోష అంతా ఈ 33 ఏండ్లూ అరణ్యరోదనమై పోవడము!



# (౩) బాధ్యు లెవరు?

ఇప్పుడు ఒకవేళ ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పటికీ, మనపూర్వచరిత్రని నిష్పాక్షికదృష్టితో పరిశీలించి, దానిలో ఏవైనా గల లోపాలను సవరించుకొంటేనే తప్ప, మనం మనరాష్ట్రంయొక్క భావ్యభివృద్ధికి తోడ్పడలేము. కాని ఈ సింహావలోకనంలో ఒకప్రశ్న అనివార్య మౌతుంది:

ఆంధ్రరాష్ట్రం ఈ 33 ఏండ్లూ రాకపోవడంలో గల తప్పెవరిది?

ప్రభుత్వంవారిదా?— పరాయిప్రభుత్వ మెప్పుడూ తన కేవిధమైన లాభం లేకపోయినా, దానంతట అది మన రాష్ట్రం విడదీసి, మన అభివృద్ధికి తోడ్పడి, మన విశిష్టతని లోకానికి స్పష్టపరుస్తుందని ఆశించడం మనదే పొరబాటు.

ఐతే తప్పు ప్రజలదా?—పరరాష్ట్రాలకు కనకవాహినులను ప్రవహింపజేసిన దానకర్ణులు! యావద్భారత దాస్య విమోచనానికి ధన ప్రాణాలను తృణప్రాయంగా అర్పించిన త్యాగమూర్తులు! ఫ్రాన్సు, రష్యా, చైనాలవంటి ఖండాంతరదేశాల దుస్థితికికూడా యథాశక్తిగా సానుభూతి తెల్పగల విశాలహృదయులు! మీదు మిక్కిలి నాయకుల మాటల కెదురాడని నమ్మినబంట్లు! వారు చూపినమార్గమే

తరణోపాయమని మనస్ఫూర్తిగా విశ్వసించి, రాష్ట్రసిద్ధికి 33 ఏండ్లు తపస్సు చేసిన సుశిక్షితదీక్షాపరులు! తప్పువారి దనడానికి ఎవరికి నోరొస్తుంది?

ఇంకెవరిది? తప్పెవరిది?

జాగ్రత్తగా ఆలోచించండి.

మనపైన మన నాయకులున్నారు.

వీరికి దూరదృష్టి లేదందామా, భాషాప్రయుక్త రాష్ట్రవాదాన్ని మొదట లేవనెత్తింది వీరు! రాష్ట్రీయ స్వాతంత్ర్యంతోపాటు భారతజాతీయ ఐక్యతకూడా వుండా లని ప్రబోధించేది వీరు!—వీరికి ప్రజ్ఞ లేదందామా, వీరిలో రాష్ట్రీయ గవర్నరు పదవి నలంకరించినవారు, అఖిల భారత కాంగ్రెసుమహాసభాధ్యక్షతకు ప్రయత్నించేవారూ వున్నారు!—వీరికి త్యాగబుద్ధి లేదందామా, మద్రాసు హైకోర్టుముందర తుపాకిగుండ్లకు గుండె నొప్పగించిన ధీరు డొకడు! కాకినాడలో లాఠీపోట్లకు తల వక్కలు చేసికొన్న వీరుడొకడు! ఇంక ఇటువంటి అసహాయశూరు లనేకమంది! వీరికి ప్రజలలో పలుకుబడి లేదందామా, బాలెట్ పెట్టెల నన్నిటినీ కాళీగా ఒకసారి, కాంగ్రెసువోట్లతో నింపి ఒకసారి, కోరినసమయంలో కోరినవిధంగా పంపగల్గారు! వేలకొలది ఆంధ్రపుత్రులని జైళ్ళకు నడిపించగల్గారు! వారి ఆస్తులను అసువులను వారిచేత ధారపోయించగల్గారు!

ఇంతటి దూరదృష్టి, ప్రజ్ఞ, త్యాగం, పలుకుబడీ గల యుగంధరులు మననాయకులు !

కాని ఈనాయకత్వం మన ఉద్యమాభివృద్ధికి తోడ్పడిన విధం ఒకసారి పరికించ తగ్గది:

౧౯౨౦ ప్రాంతంలో ఆరంభింపబడిన సహాయ నిరాకరణోద్యమం అంతవరకూ కాలోచితంగా నడుపబడుతున్న మన ఆంధ్రోద్యమానికి స్తంభనమంత్ర మైపోయింది. ఆ సహాయనిరాకరణ సమరఫలింతగా తత్క్షణమే భారతావనికి స్వాతంత్ర్యం ప్రాప్తించగలదనీ,స్వతంత్రభారతంలో ఆంధ్రాభ్యుదయానికై సావధానంగా కృషిచేసే అవకాశ మెంతైనా వుండగలదనీ మనస్ఫూర్తిగా విశ్వసించి మన కాంగ్రెసు నాయకులు ఆంధ్రకంకణాన్ని వదలి జాతీయదీక్ష బూనారు.

అపుడు మద్రాసులో గద్దెనెక్కింది జన్మతః ఆంధ్రపుత్రులే అయినప్పటికీ, అప్పటి హోదాలో వారు మన కెంతేని సహాయం చేయగలిగివుండినప్పటికీ, వారు జస్టిసు ప్రభువులగుటచేతా, వారికి కాంగ్రెసు నణగద్రొక్కడం కన్న ఘనమైన కార్యక్రమం లేకపోవడంచేతా, ఆంధ్రోద్యమం పట్ల అదివరకూ వారు ఎంత అభిమానం చూపుతూ వచ్చినా, అప్పుడుమాత్రం కార్యాంతరాసక్తులై కాలం గడిపేశారు.

ఆపైన కొన్నాళ్ళలో జైళ్ళనుండి విముక్తి పొంది వచ్చిన మన కాంగ్రెసునాయకులు, కాంగ్రెసులో ప్రత్యేక

మైన కార్యక్రమ మేమీ లేకపోవడంవల్ల, కాలాన్ని వ్యర్థ పుచ్చక ఆంధ్రరాష్ట్రోద్యమరథాన్ని కొంత నడిపారు. కాని ౧౯౩౦-౩౨లో తిరిగి జాతీయసమరశంఖారవం వీరిని పులకాంకితులను జేయగా, పూర్వోక్త విశ్వాసంతోనే, దేశహితైక వాంఛాపరత్వంతోనే వీరు ఆ ఆంధ్రోద్యమరథాన్ని నడివీధిలో వదిలి శాసనతిరస్కారాన్ని చేబూనవలసివచ్చింది.

అపుడు జస్టిసుప్రభువులు ఈ ప్రాంతాలలో రాజకీయంగా తిరిగి తలనెత్తడానికి అన్యమార్గం గోచరించక, ఆంధ్రమహాసభ ఆధ్వర్యాన్ని స్వీకరిస్తూ కొంత రాష్ట్రాభిమానం అభినయించారు. కాని అది కడుపులోలేని కౌగిలింత అవడంవల్ల, ఆ అభిమానం అనతికాలంలో తన సహజమైన చావు చచ్చిపోయింది.

చివరకు మన కాంగ్రెసునాయకులు మంత్రిపదవులు స్వీకరించడంతో స్వభావసిద్ధంగా వారిలోవున్న ఆంధ్రావేశం ఇంకొకసారి పైకి పొంగబోయింది. కాని అరవప్రధాని ప్రయోగించిన వాగ్బంధనాస్త్రంతో అది అప్పటి గుంటూరు మహాసభ (౧౯౩౯) నాటి క్షేత్రలోలోపల కృశించడం మొదలు పెట్టింది; తరువాత ౧౯౪౨ లో సత్యాగ్రహోద్యమారంభంతో అసలే అదృశ్యమైపోయింది!

ఇదీ మన నాయకులు మన వుద్యమంపట్ల అవలంబించిన వైఖరి!

వీరికి తమ తమ పార్టీ కార్యక్రమాల అవకాశాలని బట్టి, అవసరాలనిబట్టి, తాము ఆంధ్రోద్యమానికి సహాయ పడడంగాని, లేదా తాము ఆంధ్రులమన్న విషయం స్మరణకు రావడంగాని, తటస్థించింది కాని, సర్వకాలసర్వావస్థలా ఆంధ్రత్వానికి తగుప్రాధాన్యత నీయవలసిన సూత్రంలో వీరికి విశ్వాసం లేదు !

వీరిలో ఒకరికి కాంగ్రెసు కన్నతల్లి; ఆంధ్రమాత సవతి అమ్మ.—ఇంకొకరికి బ్రిటిషుప్రభుత్వం మూలవిరాట్ స్వరూపం; ఆంధ్రోద్యమం ఉత్సవవిగ్రహం !

ఆంధ్రకాంగ్రెసునాయకులకు ఆంధ్రాభిమానం లేదని ఎవ్వరమూ ఎన్నడూ అనము. కాని వీరిలోవున్న ఈ ద్వంద్వప్రభుభక్తి (dual loyalty) ఏకోణంనుంచీ పరిశీలించినా మన ఉద్యమాభివృద్ధికి ఆదర్శప్రాయమైనవిధంగా తోడ్పడ లేదని స్ఫురిస్తుంది.

ఇటువంటివారిని నమ్ముకొంటే మనకిక ఎన్నాళ్ళకు మన ఆంధ్రరాష్ట్రం సమగ్రం కాగలదు ? ఎన్నాళ్ళకు అది భారతసమాఖ్యలో అగ్రపీఠ మలంకరించగలదు ?

మన వుద్యమ మేదైనా ఫలప్రదం కావాలంటే, మన నాయకులకు దానియందు కేవలం సానుభూతి వుంటే చాలదు. వారికి ఆ వుద్యమం ధర్మసమ్మతమైనదన్న పరిపూర్ణ విశ్వాసం,

అది జయంపొందేవరకూ ఇంకొకపని ముట్టకూడదన్న భీష్మ ప్రతిజ్ఞ విధిగా వుండితీరాలి!

అనగా ఒక్కమాటలో—వారు పదహారణాల ఆంధ్రులై వుండాలి.

వారు తమ జీవితాన్ని హృదయపూర్వకంగా దానికి ధారపోయడానికి సంసిద్ధులై వుండాలి.

అటువంటివారినే మనం నాయకులుగా ఎన్నుకోవాలి. అటువంటివారినే మనం ముందుపెట్టుకు నడవాలి.

వారికి మన ప్రస్తుత నాయకులకున్న పేరుప్రతిష్ఠ లుండకపోవచ్చు. వారు అనుభవంలేని హేతువుచేత మన వుద్యమం నడపడంలో కొన్ని తప్పటడుగులుకూడా వేయవచ్చు. అయినప్పటికీ ఇంగ్లండు చర్చిలుని నమ్మినట్లు మనం వారిని నమ్మగలిగితే, వారు మన ఆలోచనాప్రోత్సాహాల చేత మనలని అచిరకాలంలో గమ్యస్థానం చేర్చగల్గుతారు. వారే ఆంధ్రరాష్ట్రాన్ని పరరాష్ట్రాలయొక్క ప్రతిబింబస్థితిలో నుంచి పైకి లేవనెత్తి, స్వయంప్రకాశమైన సూర్యగ్రహం లాగ చేయగల్గుతారు.

అటువంటినాయకత్వాన్ని ఆంధ్రమహాసభ సృష్టించ గల్గుతేనేతప్ప, ఇప్పట్లో దానికి నిజమైన మోక్షంలేదు; మనకు అసలైన రాష్ట్రంలేదు!



# (౪) కాంగ్రెసు ప్రమేయం లేకుండా ఆంధ్రులకు రాష్ట్రం

ఆంధ్రరాష్ట్రసమస్యను గురించి మనం కాంగ్రెసుని కలతపెట్టడం ఉచితంకాదు. కాంగ్రెసే వుచ్ఛ్వాసనిశ్వాసాలాడని ఒక ప్రబల ప్రయత్నంలో నిమగ్నమైవుంది. అది తను తరించక మనని తరింపజేయలేదు సరికదా, దాని ప్రస్తుత స్థితిలో మనం దాని ప్రయత్నాని కేవిధమైన అభ్యంతరమైనా కలిగించడం ఉభయత్రా నష్టదాయక మన్నమాట వాస్తవ మౌతుంది.

కాని ఈ 33 ఏండ్లూ మనం రాష్ట్రసిద్ధికి కాంగ్రెసును నమ్ముకొన్నాం: కాంగ్రెసుబలం భారతస్వాతంత్ర్యంతో ముడిపెట్టబడి వుంది: భారతవిముక్తిని బ్రిటిషువారు మన అంతర్విభజనలతో, వారి ఐరోపా సంగ్రామాలతో లంకె వేస్తూ వచ్చారు.

వీటికి దేశకాలపరిస్థితులెన్నో తారుమారై, మానవ ప్రకృతిలో ఎంతోవిప్లవం వస్తేనేకాని ఒకహద్దు కనుపిస్తుం దనడానికి వీలులేదు !

కాంగ్రెసు ప్రమేయం లేకుండా ఆంధ్రులకు రాష్ట్రం

అంతవరకూ మనసమస్య వానకు తడుస్తూ, ఎండకు ఎండుతూ ఇల్లా వుండవలసిందేనా ?—అని మనని మనం ఎన్నడో ప్రశ్నించుకొని వుండవలసింది.

కాంగ్రెసును నమ్ముకొనడంవల్ల మనం రాష్ట్రం యొక్క గుమ్మం చేరాముకదా అనికొందరు పృచ్ఛించవచ్చు.

కాని,— మొదటివిషయం, ఇది ఒక మాయగుమ్మం! ఎన్నో మెలికలు తిరిగి, ఎన్నో మయసభాంతరాలను అధిగమిస్తే తప్ప మనం దీనిని దాటలేము. అప్పటికీ, మన ప్రస్తుత స్థితిని బట్టి, సరిహద్దుసమస్యల్లో, ఆర్థికపరిష్కారాల్లో మనకు జరుగవలసిన అన్యాయమంతా జరిగి ఒక శల్యావశిష్టమైన ఆంధ్రరాష్ట్రమేర్పడగలదన్న సంకోచానికే ఎక్కువతావుంది గాని, అది సర్వాంగ సంపుల్లమైన, న్యాయమైన రాష్ట్రంగా వుండగలదని విశ్వసించడానికి వీలు కనుపించడంలేదు.

రెండవది, ఈ స్థితిని సమీపించడానికైనా, మనం స్వతంత్రశక్తి నభివృద్ధిచేసికొనక కాంగ్రెసుమీద ఆధారపడి వుండడంవల్లనే ఇంత ఆలస్యమైంది—అని మనం ముఖ్యంగా గ్రహించుకోవాలి.

కనుక మన ఆరాధ్యదేవతయొక్క పరిపూర్ణ స్వరూపం మనకు ప్రత్యక్షం కావలెనంటే,

మనం రాష్ట్రంకొరకుచేసే ప్రతిస్వతంత్రప్రయత్నమూ కాంగ్రెసుకి ప్రతిబంధకమౌతుంది, అన్న అపోహని మొదట విడిచిపెట్టి వుండవలసింది.

ఒకప్పుడు బెంగాలురాష్ట్రమంతా క్రమశిక్షణచర్య క్రిందకు తీసుకురాబడినా, కేరళ స్వతంత్రించి కొద్దిపాటి శాసనతిరస్కారం చేసినా, కాంగ్రెసు కలవరపడలేదు: హిందూమహాసభ తనకువిరుద్ధంగా ప్రపంచయుద్ధంలో ప్రభుత్వానికి తోడ్పడ నిశ్చయించినా, ముస్లింలీగు ఎప్పటి కప్పుడు కత్తికట్టుకొని తనతో యుద్ధంచేస్తున్నా, అది అలజడి చెందలేదు. ఇక మనం, భారత స్వాతంత్ర్యోద్యమానికి ఏవిధంగా అనర్థదాయకంగాని, మతకలహాలతో, జాతివైషమ్యాలతో ఏలాటి సంబంధమూ లేని, ఒక నిరుపద్రవకరమైన స్థానిక సమస్యకొరకు యథాశక్తి కృషిసల్పడం కాంగ్రెసుకు ఇబ్బంది కలుగజేసి వుండేదా?

పైగా, జిల్లాబోర్డును విభజించడం కలెక్టరు కేటు వంటిదో, తలచుకొంటే, ఆంధ్రరాష్ట్రవ్యవహారాలను వేరు పరపించడం గవర్నరు కటువంటిది! అందుచేత నయానో భయానో మనం యీపనిని గవర్నరుచేతా, అతని పైవారి చేతా చేయించి వుండతగింది. కనుక ఇది ఏ అఖిలభారత సమస్యని కాని, ఏ కాంగ్రెసు ఉద్యమాన్ని కాని అభ్యంతరపెట్ట వలసిన అగత్యం ఎప్పుడూ ఏర్పడివుండేది కాదు—

## కాంగ్రెసు ప్రమేయం లేకుండా ఆంధ్రులకు రాష్ట్రం

ఇక రెండవవిషయం,—కాంగ్రెసు సహాయం లేకుండా కూడా మనం స్వరాష్ట్రం సంపాదించగలమని, మనం ఆది లోనే గ్రహించుకొని వుండవలసింది.

మూడు కోట్ల ఆంధ్రులలో కాంగ్రెసు సభ్యులు షుమారు ఆరు లక్షలు మాత్రమే. మిగిలినవారు రెండు కోట్ల తొంభై నాలుగు లక్షలు!

ఇంతమంది ఆంధ్రులం నిజంగా తలచుకొంటే, కాంగ్రెసు ప్రమేయంలేకుండా ఆంధ్రరాష్ట్రం సంపాదించడమే కాదు,—

ఒక అమోఘమైన కొత్తరకపు సత్యాగ్రహాన్ని వ్యూహించి, భారతదేశానికి తరణోపాయం బోధించగలం!

ఆంధ్రులలో ఒక గాంధీమహాత్ముణ్ణి సృష్టించగలం!

మనకు అకుంఠితమైన ఆత్మవిశ్వాసం, నిష్కల్మషమైన దీక్ష వుంటే, ఇవి అర్థరహితమైన ప్రగల్భవాక్యాలు కావని ప్రదర్శించవచ్చు.

నిజంగా మన కీపాటికే ఎన్నడో ఆంధ్రరాష్ట్రం వచ్చి వుండేది,

ఒక్క దేశోద్ధారకుడు, తన అవసాన దశలో అలివి కాని కేంద్ర శాసన సభ్యత్వాన్ని వహించి కూర్చోనడానికి బదులు, స్వరాష్ట్రం కొరకు ఒక స్వతంత్ర సత్యాగ్రహోద్య మాన్ని నడిపించివున్నా,

ఒక్క పట్టాభి, రాష్ట్రం కొరకు వర్కింగు కమిటీ దగ్గరకు రాయబారం వెళ్లి తిరస్కృతు డైనపుడు, తాను కాంగ్రెసునుంచి వేరుపడతాననీ, దాని పర్యవసానాల కన్నిటికీ కాంగ్రెసే బాధ్యత వహించవలసి వస్తుందనీ, పెద్ద అలజడి చేసివున్నా,

ఒక్క ప్రకాశం, మొదటి కాంగ్రెసు ప్రభుత్వంలో మంత్రి అయి, "ఏమైనా సరే, ఆంధ్రరాష్ట్రవిషయం తేలుస్తేనేకాని ఒక్క అడుగైనా కదలనీయ"నని భీష్మ ప్రతిజ్ఞ చేసి రాజగోపాలాచారి ముందర కూర్చొనివున్నా,

ఆంధ్రదేశమంతా వారి వెనుక ఒక్క మాటగా నడిచివుండేది: మన కిప్పటికే రాష్ట్రం సిద్ధించి కొన్ని సంవత్సరాలై వుండేది!

కాని వారు కాంగ్రెసుశిక్షణపాశబద్ధులై వుండిపోవలసి వచ్చింది. మనం 'అన్యథా శరణం నాస్తి; త్వమేవ శరణం మమ' అని ఇంకొక ఆలోచన చేయకపోవడం తటస్థించింది.

లేని పక్షంలో మనలో యీ పాటికి ఆంధ్రరాష్ట్రం జయించుకు వచ్చిన వీరులను కావలసినంత మందిని సృష్టించి వుండే వాళ్లం!

కనుక కాంగ్రెసు లేక మనం ఏపనీ చేయలేమనడం గాని, మన రాష్ట్రవిషయంలో మన ప్రయత్నం మనం చేసి

కోనడంవల్ల కాంగ్రెసును ఇబ్బంది పెట్టినవారమౌతా మనడం గాని పూర్తిగా అశాస్త్రీయమైన దృక్పథం!

అదీగాక అంధకారమూ, విషమూ మొదలైన వాటిని కూడా మనకు లాభదాయక మయ్యేటట్టు మనం చేసి కొంటున్నాం. అదేవిధంగా "ఒక వేళ ఆంధ్రోద్యమం లోనూ, కాంగ్రెసు ప్రయత్నంలోనూ ఏదైనా పరస్పర వినాశకరమైన లక్షణం వుంటే, దానినుంచి రెంటికీ లాభ దాయకమైన ఫలితాన్ని సాధించాలిగాని, అది కారణంగా మన ఆశయాన్ని వెనక్కు నెట్టివేయవలసివచ్చింది అని కుంటి సమాధానం చెప్పుకొంటూ వూరుకోకూడదు" అని ఇప్పటికైనా మనం గ్రహించుకొంటే మంచిది.

ఆంధ్రమహాసభ లాంటి సంస్థ కాంగ్రెసు అన్న కుబుసాన్ని విడుస్తే, నిజంగా త్రాచులాగ పనిచేయగలదు ఆ స్వతంత్రం పథంలో. కాని సామాన్యంగా అది ఆంధ్రమహా జనులతో దాగిలిమూత లాడుతూ వుంటుంది!



# (౫) ఆంధ్రమహాసభ ఆంధ్రజాతికి ఏమి జేసింది?

భారత దేశానికి కాంగ్రెసు మహోపకారం చేసింది ఇంతవరకూ. ఆంధ్రమహాసభ ఆంధ్రజాతికి ఏమిచేసింది?

కాంగ్రెసు భారతదేశంకొరకు రక్తం ప్రవహింపజేసి, ప్రాణాలను అర్పించిన త్యాగమూర్తులను తయారుచేసింది. పెద్ద వ్యూహాలుపన్ని మహోద్యమాలు నడిపింపగల వీరులను సృష్టించింది. శాసనసభలలో ప్రవేశించి దేశపరిపాలనా యంత్రాన్ని అతి చతురతతో నిర్వహింపగల రాజ్యాంగ నిపుణులకు జీవం పోసింది. అస్పృశ్యతా నిర్మూలనం, మద్య పాన నిరోధం మొదలైన విషయాలలో ప్రజావర్గంలో గొప్ప ప్రబోధం కలుగజేసింది. భారతీయులకు స్వయంశక్తివల్ల స్వరాజ్యం రాగలదన్న ఆత్మవిశ్వాసం పాదుకొల్పింది. భారతజాతికూడా ఒక నాగరక జాతే అన్న కీర్తి ఖండాంతరాలకి వ్యాపింపజేసింది.

ఇటువంటి ఘనకార్యాలలో ఆంధ్రమహాసభ ఆంధ్ర దేశానికి చేసింది ఒక్కటయినా వుందీ?

మనలో రాష్ట్రాంతర విఖ్యాతిగల మహానాయకుడు, ఆంధ్రదేశంలో పుట్టి, పెరిగి, ఆంధ్రాభిమానం గలవాడు

ఒక్కడు లేడు! కలకత్తా బెంగాలీలదిలాగ, ఇది పూర్తిగా ఆంధ్రులది అని చెప్పుకోతగిన మహానగరం ఒక్కటిలేదు. మన దేశాన్ని స్వయంసమృద్ధం చేసి పరరాష్ట్రాలలోకి బాగా వ్యాపించిన గొప్ప పరిశ్రమ ఆంధ్రులదంటూ ఒక్కటి లేదు. చెప్పతగిన ఒక్క అఖిల భారత సంస్థయొక్క ముఖ్య స్థానం మన తెలుగు సీమలో లేదు.

చివరకు మన తెలుగునాటినుండి స్వతంత్రంగా వెలువడిన ఒక్క భావం లేదు!

ఆంధ్రమహాసభ ఆంధ్రుల అభివృద్ధికొరకు ముప్పై సంవత్సరాలుగా పని జేస్తోంది మరి!

ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆంధ్రమహాసభ సృష్టించిందికాదు. రాధాకృష్ణ పండితుణ్ణి బెంగాలు తయారు చేసింది. మద్రాసు, హైదరాబాదుల్లో ఆంధ్రేతరుల ప్రాముఖ్యత మూడు పాళ్లకు పైగా కనబడుతోంది. ఆంధ్ర రాష్ట్ర వాంఛ మనలో ఎప్పుడైనా తీవ్ర స్వరూపం దాల్చడం కూడా కాంగ్రెసు ప్రయత్నంయొక్క పట్టువిడుపుల మీాద ఆధారపడి వుంటుంది. ఇక మహాసభ ముద్ర దేనిమీాద కనుపిస్తోంది?

రాష్ట్రసాధనం కష్ట సాధ్యమైన కార్య మన్నమాట నిజమే. కాని దానికోసం మహాసభ నిష్కల్మషచిత్తంతో తన యావచ్ఛక్తినీ వినియోగించి ప్రయత్నించిన సమయ

మొక్కటన్నా యెక్కడ? ప్రయత్న లోపం లేకుండా వుంటే మన కోరిక ఫలప్రదం కాకపోయినా ఫరవాలేదు. ప్రస్తుత పరాజయంలో భవిష్యద్విజయం యొక్క బీజాలు ఇమిడి వుంటై. కాని మనకా సంతృప్తి ఐనా లేదు.

పోనీ, 'ఆరంభింపరు నీచమానవులు' అన్నట్టు మహాసభ రాష్ట్రసిద్ధికి ప్రయత్నంచేయడం లేదందామా, అది అధీ ఒప్పుకోదు.—ప్రజాసామాన్యాన్ని ఓటమికన్నా ఎక్కువ నిర్వీర్యంచేసేది, పాము చావనీ బడితె విరగనీ ఇటువంటి నడమంత్రపు స్థితి!

రాష్ట్రసాధన మాట అల్లా వుంచుదాం. రాష్ట్రం లేక పోయినా మహారాష్ట్రుల్లాగ ఆంధ్రుల కేదో ఒక విధమైన ప్రత్యేకశక్తిని సమకూర్చి, వాళ్ల కీర్తిని విస్తరింపజేసే పను లెన్నో చేసి వుండవచ్చునే యీపాటికి! ఆంధ్రులు భారత దేశంలోకల్లా ఎక్కువ కళాభిజ్ఞులు. మహాసభ తన యాజమాన్యంక్రింద ఒక బ్రహ్మాండమైన ఆంధ్రకళా కేంద్రాన్ని సృష్టించి, దానికి భారతదేశం, యావత్ప్రపంచం దాసోహమ్మనేటట్టు చేసివుండవచ్చునే! మన పొగాకువంటి ముడి సరుకులు,కొన్ని,ఉత్తమోత్తమమైన తరగతికిచెందినవని జగత్ప్రఖ్యాతి వహించినై. ఒక పెద్ద సిగరెట్టు ఫ్యాక్టరీవంటి యంత్రాగార నిర్మాణానికి తోడ్పడి ఆంధ్రులలో ఒక రిద్దరినైనా కోటీశ్వరులని తయారుచేసి వుండవచ్చునే! ఔత్తరాహుల దగ్గిరనుంచి తాకీదులు వచ్చేవరకూ ఎదురుచూడక,

"నా తెలుగు సీమలో నూటికి నూరు అక్షరాస్యు లయ్యే వరకూ నిద్రపో"నని కంకణం కట్టుకొని ఆపని నెరవేర్చి వుండవచ్చునే! చివరకు మనకు ప్రత్యేకంగా ఒక రేడియో స్టేషనుగాని, ఒక సైనిక కళాశాలగాని, లేక కనీసం ఒకటి రెండు ఆంగ్ల దిన పత్రికలనిగాని సాధించి వుండవచ్చునే!

ఆంధ్రదేశపు రైల్వేప్రయాణీకుల సంఘాన్ని గురించి అప్పుడప్పుడు వింటూవుంటాము: బెజవాడ ప్లాట్‌ఫారంమీద ఇంకా రెండు బెంచీలు ఎక్కువ వేయించినట్టూ, రాజమండ్రి స్టేషన్ను రోజుకు రెండుసార్లు వూడ్చే ఏర్పాటు చేయించినట్టూ, మంగళగిరి ప్రయాణీకుల షెడ్డులో ఒక లాంతరు స్తంభం పాతించినట్టూ, ఇత్యాదిగా. ఇవి చూడడానికి ఎంత స్వల్పమైన విషయాలుగా కనుపించినా, రైల్వేప్రయాణీకుల సంఘం తన వునికిని సార్థకపరచుకొంటోంది; లేదా కనీసం ఆ ప్రయత్నంలో వుంది. మహాసభకన్న, ఒక లాంతరు స్తంభం పాతించిన, ప్లేటుఫారాన్ని ఒకసారి ఎక్కువ వూడ్పించిన, ఆ చిన్న సంస్థే మెరుగనిపిస్తోంది !

పరాధీనమైన, చైతన్యరహితమైన ఈ నిరర్థకపు జీవితం ఆంధ్రమహాసభ కింకా ఎన్నాళ్లు ?

ఆంధ్రులు వాక్శూరులేగాని కార్యశూరులు కారన్న అపఖ్యాతిని తుడిచివేయించడానికి మనం అందరికన్న ఎక్కువ శ్రమపడాలి. ఇతరులకన్న వెనకపడి వుండడమే మన ప్రత్యేక

లక్షణంలాగ కనుపించే ప్రస్తుతస్థితిలోనుంచి ప్రజల నుద్ధరించడానికి ఆంధ్రమహాసభ తోటిసంస్థలకన్న అధికంగా కృషిచేయాలి. కాని దానినుండి అసలురావడమే అనుమానమైనపుడు ఇక వడ్డీమాటేమిటి ?

చైనాలో యుద్ధం జరుగుతోందని హిట్లరు తన పని మానుకోలేదు. అల్లాగే ఐరోపాలో సంగ్రామం భీకరంగా వుందనిగాని, జపానులో భూకంపంవచ్చిందనిగాని మన సాధన మనం చెయ్యకుండా వూరుకోకూడదు.

ప్రపంచచరిత్రలో మన చిత్తాన్ని పరిభ్రమింపజేసెందుకు ఇటువంటి భయంకర సంఘట్టనలు ఎప్పుడూ జరుగుతునే వుంటవి.

కాని ఆంధ్రమహాసభ మాత్రం, ఆంధ్రాభివృద్ధినే పరమలక్ష్యంగా పెట్టుకొన్నదైతే, పరరాజ్యచరిత్రల వినోదాన్ని చూస్తూ ఆప్రవాహంలో కొట్టుకుపోకుండా, వాటివల్ల తనకు కావలసిన గుణపాఠం గ్రహించి, దానిని ఆంధ్రోన్నతికి అనుకూలమైన విధంగా వుపయోగించాలి.

అటువంటి ఏకాగ్రతా, కార్యాచరణశక్తీ, "ఆంధ్రులకు వుంది"అని ప్రపంచానికి చాటగల, రాష్ట్రనిర్మాణంతో సంబంధంలేని, కొన్ని ఘనకార్యాలనైనా సాధించడం ఆంధ్రమహాసభ యొక్క ధర్మం.

కాని ఆ సభయొక్క కార్యకలాపాలు దుర్భిణీయంత్రప్రభావంతోగాని కనుపించనివి !

# (ఉ) నాట్యబృంద సమాఖ్య

సజీవమైన యేసంస్థగాని ప్రపంచాన్ని ఉద్రూత లూగించే సమయాలలో ఎంత గంభీర కార్యకలాపంతో తొణికిసలాడుతూ వుంటుందో! కాంగ్రెసూ, ముస్లింలీగూ, హిందూమహాసభ మొదలైన అన్నిటిలో నాయకుల వాఙ్మూలాలు, వాదప్రతివాదాలు, పత్రవ్యవహారాలు, టెలిగ్రాములు, రాజప్రతినిధితో సంభాషణలు, కార్యనిర్వాహకవర్గ అత్యవసర సమావేశాలు, వాటి తీర్మానాల కొరకు ప్రజానీకం యొక్క నిరీక్షణ, వాటిమీద సభలు, చర్చలు, ప్రముఖుల ఉపన్యాసాలు, పత్రికల వ్యాఖ్యానాలు, ఆందోళన, ప్రజాశక్తి విజృంభణం, ప్రభుత్వ నిరంకుశ ప్రళయ తాండవం,—అటు ప్రబలకోలాహలాన్వితమైన ఆ నాటకము!

ఇటు నిరంతర గాఢనిద్రాముద్రితమైన మన ఆంధ్ర మహాసభ!

చెప్పతగిన ఒక్క ప్రణాళిక లేదు. ఒక్క కార్యక్రమం లేదు. ఒక్క తీర్మానం లేదు. బౌద్ధావతారమంతటి శాంతము! హిమవంతుడియంతటి అచలత్వము! ఎక్కడో సుస్థిరంగా ఒక అవాఙ్మానసగోచరాత్మకమైన తపస్సమాధిలో నిమగ్నమై వుంటుంది!

ఈ నిర్వీర్యతకు, ఈ అచేతనస్థితికి ఆంధ్రుడైన ప్రతి వాని గుండె నీరై పోతూవుంటుంది. కాని యీ దుస్థితికి సరియైన కారణం, భయమూ అభిమానమూ లేక ప్రయత్నిస్తే తప్పక కనుపిస్తుంది.

ఆంధ్రమహాసభ కొన్ని నాటకసంఘాల సమాఖ్య.

అందులో మొదటిది కాంగ్రెసు నాయకుల బృందం! మహాసభలో వీరే అధిక సంఖ్యాకులు. వీరికే అత్యధికమైన పలుకుబడి. అక్కడ వీ రేర్పరచిన ప్రాతిపదికకు ప్రతిఘటన లేదు. వీరు ప్రవేశపెట్టదలచుకొన్న తీర్మానానికి తిరుగులేదు. వీరికి ఏదైనా వుద్యమాన్ని జయప్రదమైన మార్గంలో నడిపింపగల సమర్ధతవుంది. అవసరమైనపుడు ఎంత త్యాగమైనా చేసి బాధలకోర్వగల సహనశక్తివుంది. స్వరాష్ట్రమంటే ప్రేమకూడావుంది. వీరు ఆంధ్రరాష్ట్రం విషయంలో కావలసిన ప్రాధమిక ప్రబోధం అంతా కలుగజేశారు కూడాను. కాని,

వీరికి స్వరాష్ట్రం మీది ప్రేమకన్నా కాంగ్రెసు మీది భక్తి యెక్కువ. కాంగ్రెసు వీరికి సాక్షాత్తు భగవత్స్వరూపం. దాని మాట వేదవాక్యం. దాని ఆజ్ఞ శిలాక్షరం. 'నీవేతప్ప నితఃపరంబెరుగ' నని తామే కాకుండా యావద్భారతమూ దాని సన్నిధిని జేరి తరించాలని వీరి భ్రాంతి!

కాంగ్రెసుమీాది ఈ అచంచలభక్తి వీరి రాష్ట్రాభిమానాన్ని అదుపుచేస్తోంది. అందుచేత మన రాష్ట్రోద్యమ బాణంయొక్క ప్రయోగంగాని, ఉపసంహారంగాని, మన ఆవశ్యకతనుబట్టి కాక, కాంగ్రెసు పిలుపునిబట్టి జరగాలని వీరు తాపత్రయ పడుతూ వుంటారు! దీనికితోడు, మానవ సహజమైన ఆశాపాశము, ఏ కాంగ్రెసు అధ్యక్ష పదవిఅనో, ఏ అఖిలభారత నాయకత్వమనో ఒక మిథ్యాగౌరవాన్ని చూపుతూ వీరిలో చాలమందియొక్క ఆత్మ స్వాతంత్ర్యాన్ని శాశ్వతంగా గుత్తకు తీసికొంది!

అది వీరు ఒప్పుకోరు. కాని ఏదైనా పరీక్షాసమయం వచ్చినపుడుమాత్రం తమకు దైవసమానమైన కాంగ్రెసును వదలిపెట్టరు, కాని ఆంధ్రరాష్ట్రాన్ని జారవిడుస్తారు! అంత వరకూ రెండు రథాలమీాదా ఒకేసారి వూరేగాలని, వీరు మనరాష్ట్రంపట్ల, తెలిసో తెలియకో, శల్యసారథ్యం మాత్రం చేస్తున్నారు. రాష్ట్రానికీ కాంగ్రెసుకూ సంఘర్షణ వచ్చిన తుది సమయాల్లో నల్లా రాష్ట్రవాదనకు బ్రేకు వేస్తున్నప్పటికీ, రాష్ట్రభక్తిలోకూడా తామే అగ్రగణ్యులమని తమ పలుకుబడివల్ల రుజువుచేసికొంటున్నారు. ఆంధ్రమహాసభకు సూత్రధారిత్వం వహించి, ఎంతటి సదుద్దేశ్యముతోనైనా, వీ రాడుతున్న దివ్యనాటక మిది!

సరియైన ఆంధ్రజాతీయతాభివృద్ధికి వీరు తమ పొలిమేరలు దాటిరాని ఆత్మబంధువులు!

ఇక జస్టిసూ, జమీందారీ వగైరా ప్రభుత్వ పక్షీయు లది రెండవ నాటక సమాజం. వీరికి అటు దేశభక్తి ఎల్లా లేదో, ఇటు రాష్ట్రప్రేమకూడా అల్లానే శూన్యం. వీరు ఎంత అవసరం వచ్చినా త్యాగం మాత్రం చెయ్యరు! అటువంటి సందర్భాలలో యుక్తియుక్తంగా తప్పించుకొన డానికి కాంగ్రెసువారి భిన్నవాక్చాతుర్యం కూడా వీరి దగ్గర లేదు. మహాసభ వేదికమీద "రాష్ట్రం కావాలి" అనీ, ప్రభుత్వమందిర సోపాన పంక్తిమీద "వ" ద్దనీ, స్పష్టంగా ద్వంద్వార్థ రహితమైన పొడిమాటలలో చెప్పివేస్తారు.

అయినప్పటికీ వీరుకూడా అప్పు డప్పుడు ఈ నాట కంలో ప్రధానపాత్రలు ధరిస్తూ వుంటారు. అది కేవలం, ఈ మహాసభ జాతి మత పక్ష విభేదాల కతీతమైన ఒక అపూర్వసంస్థ, అని కాంగ్రెసు ప్రజాసామాన్యాన్ని మోసపుచ్చడానికి పన్నిన మాయోపాయం కాదు. జస్టిసు ప్రభువు లంత అల్పజ్ఞులుకారు. వీరికి స్వార్థం వుంది. సార్వ భౌముడి ప్రభుత్వం నిరభ్యంతరంగా సాగేటట్టు చూడడం లోనూ, "లా అండ్ ఆర్డరు" లను కాపాడడంలోనూ వీరు సంపాదించుకొన్న అపకీర్తికి ప్రతీకారంగా కొంత రాష్ట్రాభిమానం చూపించి, తిరిగి ప్రజాదరణ సంపాదిద్దా మని వీరియెత్తు! వీరాడుతున్న నాటకమిదీ!

వీరు ఈ పద్ధతులమీద మహాసభ కార్యక్రమంలో పాల్గొనడంకన్న, దానికి దూరస్థులై వుంటేనే రాష్ట్రోద్యమానికి ఎక్కువ వుపకారం జరుగుతుంది!

మూడవవర్గం యువకులది: అక్కడి అందరిలోకీ కలితీలేని రాష్ట్రాభిమానం వున్నవారూ, అవసరమైనపుడు ఎంత త్యాగానికైనా వెనుదీయనివారూ వీరే! మహాసభకి వున్న శాస్త్ర జీవరేఖ అయినా వీరివల్లనే అనడం అతిశయోక్తి కాదు. వీరిలో తగిన కట్టుబాటేవుంటే మనకు స్వరాష్ట్రం ఇదివరకే ఎప్పుడో వూడిపడి వుండేది.

కాని వీరిదగ్గిర అదేలేదు! వీరు ఒకదానిని గురించి ఎంత త్వరగా దీక్షవహించగలరో, అంతకన్న త్వరగా దానిని త్యజించగలరు. వీరిది దూరదృష్టిలేని శుష్కవుద్రేకం. బాధ్యతలెరుగని వెర్రి ఆవేశం. అరవలని చెడ తిట్టడమే ఆంధ్రాభిమానమని వుద్దేశం. వీరిలో క్రమశిక్షణ అన్నమాట కనుపించదు. పట్టి అమాయకులు!

ఇటువంటి వారు కాంగ్రెసు నాయకులకు వీరపూజ చేయడంలో ఆశ్చర్యంలేదు. ఎప్పుడో ఉడుకు రక్తం మరీ పైకుబికినపుడు ఒక్కొకసారి వారిమీద తిరగబడినా, మొత్తంమీద వీరు కాంగ్రెసు కరతల సాలభంజికలు. అందుచేత ఆంధ్రమహాసభా నాటకంలో ఈ అమాయకులు వూరికే కాంగ్రెసు తెరలు ఎత్తి దింపడానికి మాత్రమే వుపయోగింపబడుతూ వుంటారు!

మహాసభలో ఇప్పుడిపుడు ఇంకొక చతుర్థబృందం కూడ మొలకెత్తుతోంది: కాంగ్రెసుచేత క్రమశిక్షణచర్య తీసికొనబడినవారూ, వ్యక్తిపరంగా యోగ్యులైనా సహవాస దోషంచేత ఇతరత్రా అపకీర్తిపాలైనవారూ ఈ సంఘంలో సభ్యులు. కాని మహాసభలో వీరి స్థానమింకా వాయురూపంగానే వుంది; స్థిరపడలేదు. ప్రస్తుతం వీరిది అనుచరవర్గంలేని నాయకత్వం; అందుచేత గణుతింప నవసరంలేనిది.

ఈ పరిస్థితుల్లో ఇక ఆంధ్రమహాసభ నిద్రపోక ఏం జేస్తుంది? మహాసభయొక్క ఎంతటి పరీక్షాసమయంలోనైనా, కాంగ్రెసు అవసరాన్ననుసరించి ఆంధ్ర కాంగ్రెసు నాయకు లందరూ శపీమని వెనక నిలబడిపోతారు: త్యాగానికి తక్కువైంది ఏమీ చెయ్యనవసరం లేదనుకొని జస్టిసు ప్రభువులు రంగంమీదనుంచీ విరమిస్తారు: సక్రమ స్వతంత్ర నాయకత్వంలేక యువకులు అవతలికి నెట్టివేయబడతారు. ఇక మహాసభకు దీర్ఘసుషుప్తిగాక మరియేముందీ? వత్తి అంతా లాగివేసిన తర్వాత దీపం ఆరిపోక ఏంజేస్తుందీ?

ఈ దుర్భర పరిస్థితులు మారడానికి ఆంధ్ర మహాసభ ఆపాదమస్తకమూ సంస్కరింపబడవలెనన్న మాట వాస్తవం. కాని అంతకు పూర్వం, ఆంధ్ర ప్రజానీకం తమ స్థితిగతులు ఇంటా బయటా ఎల్లావున్నవో జాగ్రత్తగా పరిశీలించి, వాటి అభివృద్ధి కొరకు తమ సహజ తత్వంలోనే యోగ్యమైన విప్లవం తెచ్చుకొనడం కూడ అవసరం.

---

# (౭) స్వయంశక్తి

మనకు స్వయంశక్తి లేకనే 33 ఏండ్లు స్వరాష్ట్రం సంపాదించ లేకపోయినాం—(నేటివరకూ గల పరిస్థితులను బట్టి, ఒకవేళ అది ఇప్పుడు సాధింపబడినా అది మన శక్తి సామర్థ్యాలవల్ల కాదని మనం స్పష్టంగా గ్రహించుకోవాలి! భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సిద్ధాంతాన్ని భారతరాజ్యాంగ నిర్మాణవ్యవస్థ అంగీకరించినప్పటికీ, అది ఆంధ్ర రాష్ట్రోద్యమ ఫలితమని ఎవ్వరూ చెప్పరు. అది కాంగ్రెసు ప్రణాళికా ప్రభావమన్న మాట జగద్విదితం!)—

కనుక ఆ స్వయంశక్తి లేకనే, ఇపుడు ఎవరి దయా ధర్మ బిచ్చంగానైనా స్వరాష్ట్రం నిర్మింపబడినా మనం దానిని నిలబెట్టుకోలేకపోవచ్చు కూడాను!

దీంట్లో ఏమీ ఆశ్చర్యం లేదు: ఇప్పటికే వస్త్ర పరిశ్రమలో మన శక్తినంతా గుజరాతీలు రాయించి పుచ్చుకొన్నారు.

టాయిలెట్లూ మందులూ వగైరాల ద్వారా బెంగాలీలు మనల్ని కొల్లగొట్టుకుపోతున్నారు.

మన ఉద్యోగాలూ మన పదవులూ ఆక్రమించుకొని అరవలు మనలని బానిసలని జేశారు.

మనకు క్షాత్రం లేదని బహిరంగంగా చాటి, యావద్భారతానికీ తానే రక్షకుడనని పంజాబీ మన పటాలాల్ని ఆక్రమించుకొన్నాడు.

ఇల్లాగే, మనకు రాజకీయ పరిజ్ఞానం ఒకడు కలిగిస్తున్నాడు; కళా చైతన్యానికి మార్గం ఒకడు చూపిస్తున్నాడు; విద్య ఒకడు నేర్పుతున్నాడు; మతం ఒకడు బోధిస్తున్నాడు!

మనమల్లా ఎంతసేపటికీ ఇతరులవంక పైపైపు దృష్టి పెట్టి చూస్తున్నాం! అంతే.

అభ్యాసంచేత ఆత్మ విస్మృతి కలిగింది గాని, మన విశాల భూభాగాన్నికూడా తుత్తునియలుచేసి ఎవడికందిన మటుకు వాడు ఇప్పుడే అనుభవిస్తున్నాడు.

ఎప్పుడో తాతలనాడే మన సీమలో లోతైన గోతులు త్రవ్వి, ౯౦ లక్షల ఆంధ్రులున్న ఖండాన్ని వేరుచేసి మనకు కాకుండా తన్నుకుపోయాడు నిజాము;

30 లక్షల తెలుగు నాలుకలకు అరవపూత పూసి దక్షిణ జిల్లాలలో మనకు నామ రూపాలు లేకుండా చేస్తున్నారు తమిళ సోదరులు;

మనకు శిరచ్ఛేదం చేసినట్టు ఉత్తర సరిహద్దుల్లో ఓఢ్రులు మనని అదరగొట్టి కొన్ని తాలూకాలు లాక్కొన్నారు;

మనదేశ వైశాల్యాన్ని ఇంకా శుష్కింపజేద్దామని, మన తిరుపతి కొండమీద ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ అంటూ పెట్టి అరవవాడు తన జెండా పాతుకున్నాడు!

ఇదంతా మన బలహీనతకూ, మన నిస్సహాయస్థితికీ తార్కాణం కాదూ? మనకీ స్థితిలో రాష్ట్రం ఏర్పడి వున్నప్పటికీ, అది మన మనస్తత్వాన్ని మారుస్తుందా? భారత దేశానికి స్వరాజ్యం వచ్చిన తర్వాత, ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం, ప్రస్తుతం యూరపులో వున్న వివిధ జాతులలాగ, అతి స్వార్థపరత్వబుద్ధితో నిండిపోవడంలోనూ, అనుకరణ స్వభావులమైన మనం ఇప్పటి మాదిరిగానే అప్పుడుకూడా ఇతర రాష్ట్రాలకన్న ఎంతో వెనుకబడి వుండడంలోనూ ఏమీ ఆశ్చర్యం లేదు.

అటువంటి దుస్థితినుంచి తప్పించుకోవలెనంటే, మనకు నామమాత్రమైన స్వరాష్ట్రంకన్న, నికరమైన స్వయంశక్తి ఎక్కువ అవసరమని మనం గ్రహించాలి.

నిజానికి రాజకీయంగా మన కెన్ని చిక్కులున్నయ్యో, మహారాష్ట్రులకుగూడా అన్నీ వున్నై. వాళ్ల దేశంలో కూడా బొంబాయిరాజధాని అంటూ, మధ్యపరగణాలంటూ, నిజాంసంస్థానమంటూ మూడు ఎత్తైన గోడలు లేచినై. అయినా వాళ్లు ప్రత్యేక రాష్ట్రంకోరకు అంతగా వాచరలాడడంలే దెందుచేత?

మనవలె వాళ్లు బలహీనులుకారు. ఇతరులు దోచుకు పోతారన్న భయం వాళ్లకు లేదు.

బొంబాయివంటి మహానగరంలో గుజరాతీలతో ఏ విషయంలో పట్టినా సమవుజ్జీలై, ఢీ అంటే ఢీ అంటున్నారు;

మధ్య పరగణాల రాష్ట్రీయ స్వయం పరిపాలనలో హిందూస్థానీయుల్ని అల్లా వుండమని మొదటి మంత్రి వర్గం వాళ్లే ఏర్పరచారు;

హైదరాబాదులో అధిక సంఖ్యాకులైన మన తెలుగు వాళ్లను పూర్తిగా వెనక్కు నెట్టి, స్టేటు సత్యాగ్రహంవంటి ప్రతి ప్రజాహిత వుద్యమంలోనూ వాళ్లే మహానాయకత్వం వహిస్తూవుంటారు.

పైగా కాంగ్రెసు బలం మాట అల్లావుండగా, ఒక్క "గురూజీ" శంఖం పూరిస్తే, అతని చేతిక్రింద శిక్షణపొందిన పదివేల స్వతంత్ర శాంతి సైనికులు హాజరవుతారు; ఒక మూంజీ సింహనాదంచేస్తే, హిందూ మహాసభ పేరిట తయారైన వీరులు అంతకుమించి అయత్తపడుతారు.

రాజకీయంగా గీతలుగీచి, ఒక రాష్ట్రంలాగ సరిహద్దు లేర్పడకపోయినా, వాళ్లకు "మేమందరం ఒకటి" అన్న ఆత్మచైతన్యంవుంది. వాళ్ల జాతీయతకు ఏవిధమైన భంగం వాటుకలిగినా, ఆత్మరక్షణ కొరకు జయప్రదంగా పోరాడ గలిగిన శక్తివుంది. ఇక ప్రస్తుతం వాళ్ళకు రాష్ట్రావశ్యకత అంతగా ఏముందీ?

కాని మన మటువంటినోము నోచిందెక్కడ? మనకూ కాంగ్రెసువల్లగాక స్వయంప్రకాశంగల నాయకులేరీ?

మనం అఖిలభారతసమస్యల్లో, కాంగ్రెసువంటి సంస్థలకు మన శక్త్యనుసారం తప్పక సేవచేయవలసిందే! కాని మన ఆంధ్రపుత్రుడు పదచ్యుతుడైనపుడు, మన తెలుగు తల్లి అవమానింపబడేటప్పుడు, మన త్రిలింగరాజ్యంమీాద ఇంకొకపతాకం ఎగిరేటప్పుడు, ఆ సమస్యల ప్రసక్తికి స్వస్తి చెప్పి మనం మన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనేటందుకు మన సర్వస్వమూ సమర్పింప సిద్ధపడాలి.

అసలు మన కటువంటి స్వయంశక్తి కలిగినప్పుడే మనం కాంగ్రెసుకు ఎక్కువ సహాయం చేయగలుగుతాం.

మనకా స్వయంశక్తి కలిగించేపని కాంగ్రెసుఎప్పుడూ చెయ్యలేదు; చెయ్యవలెనని మనం ఎదురుచూడటం కూడా వివేకంకాదు. అది ఆంధ్రమహాసభ విధి.

కాని యీా మహాసభ కాంగ్రెసుభానుడి వెలుగువల్ల ప్రకాశించే క్షీణచంద్రుడి స్థితిలోనుంచీ బయటపడితేనేతప్ప తన విధ్యుక్తధర్మాన్ని సక్రమంగా నిర్వహించుకోలేదు.

ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధినే ప్రధానాశయంగా పెట్టుకొని, ఆంధ్రులలో ఆత్మవిశ్వాసమూ స్వయంశక్తీ సృష్టించి, వాటివల్లనే సమగ్రమైనరాష్ట్రనిర్మాణమూ, దాని రక్షణా చేయగలిగించినప్పుడే మహాసభయొక్క పేరూ జన్మా సార్థకమౌతవి.

లేనిపక్షంలో మనకు రాష్ట్రీయకాంగ్రెసుసంఘమే చాలు.



## (౮) నిజాము దురాశ

మహా ఘనతవహించిన నిజాము ప్రభువులకు ఉత్తర సర్కారులలో చీలిక కావలెనట!

ఆశ్చర్యంలేదు.

మనకు నోరు లేనంతవరకూ, మన ఇరుగు పొరుగు వారి కిటువంటి విపరీత బుద్ధు లెన్నైనా పుడుతూ వుండడం సహజం!

ఆంధ్రవిశ్వవిద్యాలయంనుంచీ రాయలసీమని మద్రాసు కొరుక్కుతింటే తలవంచి వూరుకొన్నాం. కొంత ఆంధ్రఖండాన్ని ఒరిస్సాగద్ద తన్నుకుపోతే, చచ్చినవాడి కోస మేడ్చినట్లు కొంతకాలం విలపించి వైరాగ్యం పొందాం. తిరుపతి కొండమీద అరవవాడు తిష్టవేసుకొంటూ వుంటే కొన్ని నిముషాలు తాటాకు మంటలాగ మండి చల్లారి పోయాం. తొలిసారి కాంగ్రెసు అధికారంలోవున్న అల్ప కాలం (౧౯౩౮-౩౯) లో ఉష్ణోగ్రత బాగా పైకెక్కిన పైత్యరోగివలె, రాష్ట్రాన్ని గూర్చి రెండు వెర్రికేకలువేసి, తరువాత మన సహజతత్వంలోకి జారి ఆసంగతే ఎత్తు కొనడం మానివేశాం!

ఇటువంటివాళ్ళం, సర్కారులను నిజాము కలుపు కొంటే మాత్రం ఏమిచేస్తామూ? బహుశా, రెండు సభలూ, వాటి తీర్మానాలూ! అంతే! అప్పటితో మనకు పరిపూర్ణ

మైన మనశ్శాంతి, మన అంతరాత్మకు అనంతమైన సంతృప్తి! అమ్మడు పోయిన మేకపిల్లలాగ రెండు రోజులలో కొత్త ప్రభువుకి అలవాటు పడిపోతాం!

ఈ వార్త అసత్యమై యుంటుందని మన మేమీ ఆశ పెట్టుకోనక్కరలేదు. ప్రభుత్వ రహస్యాలు చివరి వరకూ బయటపడవు. ఇటీవల బీరారుమీద ఆసఫ్‌జాహి పతాకం ఎగిరే విషయంలో, ఇరుకక్షుల వారికీ సంతకాలు జరిగే వరకూ మానవ మాత్రుడికి తెలియదు! పైగా అంతవరకూ నిజాం ప్రభుత్వ ప్రకటనలు ఆ వార్తలన్నీ నిరాధారాలని చాటుతునే వుండేవి! అల్లాగే బందరు రేవు విషయంలోకూడా మనకు తెలియని అవనికాంతర్వ్యవహార మెంతైనా జరుగుతునే వుండవచ్చు.

అసలు ఇది కేవలం నిజాము దురాశే కాదు, బ్రిటిషు వారికుట్ర కూడా నని కొందరి వూహ.

అయివుండవచ్చు. ప్రభువులకి బ్రిటిషుఇండియాలో స్థానబలిమి సన్నగిలుతోంది. అందుచేత సంస్థానాధీశుల కీవిధమైన లంచమిచ్చి, వారిని మంచిచేసికొని, పరిపాలన వారిద్వారా సాగిద్దామని వారి ఎత్తు అయివుండవచ్చు.

అందులో అందరికన్న నోరుమాలిన వాళ్ళముగనుక, ముందు మనమే (తెలుగు వాళ్లమే) కనపడి వుండవచ్చు ఈ కుట్రకి ఆహుతికావడానికి!

దీనితో సమకాలికంగా బళ్ళారి ముస్లింలీగు 'దత్త మండలాలని తిరిగి నిజాము కొప్పగించవలెననే తీర్మానం కూడా వినిపిస్తోంది!

ఇదంతా కలిపి, ఒక "స్వతంత్ర విశాల హైదరాబాదు"ని వారు తయారుచేస్తారట!

'స్వతంత్ర' అన్నపదానికి 'నిరంకుశముస్లిం ప్రభుత్వము గల' అని అసలైన అర్థం; 'విశాల' అంటే తెలుగుసీమని పూర్తిగా కబళించిన' అని సరియైన తాత్పర్యం.

వీరియొక్క ఇంతటి ధూర్తత్వానికి కారణం, మనకు ఆత్మచైతన్యమూ స్వయంశక్తీ లేకపోవడమేనని వేరే చెప్ప నక్కరలేదు.

ఉన్నట్లయితే, వారు 'విశాల హైదరాబాదు'నుగూర్చి ఆలోచించేలోపలనే మనం 'విశాలాంధ్ర'ని నిర్మించి వుండే వాళ్ళం. లేదా మన శక్త్యనుసారం, మన ఏకగర్భసంజాతుడైన తెలంగాణాసోదరుడికి ప్రతివిషయంలోనూ చేదోడు వాదోడుగా వుంటూవుండే వాళ్ళం. కాని అక్కడ అటువంటి తమ్ముడొకడున్నాడని కూడ మనం సరిగా గుర్తించినట్టు కనుపించదు.

నిజాంసంస్థానంలో మన ఆంధ్రులే అధికసంఖ్యాకులు; ప్రభుత్వాదాయంలో ఎక్కువపాలు మన తెలంగాణానుంచే వెడుతుంది; ముఖ్యపట్టణమైన హైదరాబాదు మన తెలుగు జిల్లాలలోనే వుంది.

అయినప్పటికీ అక్కడ మన తెలుగువాడి ఆకారం కనుపించదు; తెలుగుమాట కానీకి చెల్లదు; తెలుగుతనం ఈశ్వర తిరస్కారం!

అసలే హైదరాబాదు నాగరికతలో బాహ్య ప్రపంచానికి ఒక శతాబ్దం వెనకబడి వుంది. అందులో మన ఆంధ్రుడు బ్రిటిషుఇండియాలో లాగ అన్నిటికన్న అడుగు మెట్టున వున్నాడు. (—ఇదంతా అక్కడి ఆంధ్రోద్యమ నాయకుల ప్రశంసాపాత్రమైన కృషికి తగిన క్షమాపణలతో—)

ఇటువంటి సోదరుణ్ణి సాధ్యమైనంతవరకూ ఉద్ధరించ వలసిన బాధ్యత మనదికాదూ? అతడికి తగిన చేయూత నిచ్చి కనీసం మనతో సమానుణ్ణి చేయవలసిన ఆవశ్యకత మనకు లేదూ?

కాని మనం వారికి ఏమిజేశామూ?

౧౯౩౮ ప్రాంతంలో అక్కడి ౮౦౦ మంది హిందూ విద్యార్థులూ స్వధర్మరక్షణకొరకై తమ స్వస్థానాన్నీ విశ్వ విద్యాలయాన్నీ విడిచి పరదేశాల పాలౌతూవుంటే మనం దాన్ని ఒక వినోదంలాగ చూచాం! అందులో వున్న ౪౦౦ మంది తెలుగు బిడ్డలకూ ఆర్తత్రాణ పరాయణుడై నాగ పూరు వైసుఛాన్సలరు ఆశ్రయమీయవలసి వచ్చింది! మన ఆంధ్రవిశ్వవిద్యాలయానికి చీమకుట్టినట్లయినా కాలేదు!

అక్కడ తలయెత్తిన సత్యాగ్రహోద్యమానికి, నాయకులూ, స్వచ్ఛందసేవకులూ పంజాబునుంచీ, కాశ్మీరము నుంచీ కూడా వేలసంఖ్యలో వచ్చారు. కాని ఆ సంస్థానపు సరిహద్దులని తాకుతూవున్న గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాల నుంచీ ఒక్క ఆంధ్రుడు వెళ్లలేదు !

బ్రిటిషూ, నిజామూ ఆంధ్రుల పొలిమేరలు రాచు కొంటూ వుండడమే కాకుండా, దాటడానికి ఏమీ నైసర్గి కావరోధాలు కూడా లేవు. కనుక అక్కడికి చీమలపుట్టల లాగ సత్యాగ్రహులను పంపడానికీ, అక్కడివారికి బ్రహ్మాండ మైన ప్రబోధం కలుగజేయడానికీ మన సర్కారులకున్న సదు పాయం ఎవ్వరికీ లేదు. మనమల్లా చేసివున్నట్లయితే, ఇతర విషయా లెల్లావున్నా, రాబోయే విశాలాంధ్ర నిర్మాణానికి ఒక శాశ్వతమైన పునాది వేసి వుండేవాళ్ళం.

కాని మనం వారికి చిన్నమెత్తు సహాయం చేయలేదు సరికదా, మదరాసు నగరంలో ఆ సత్యాగ్రహాన్ని గురించిన సభలు జరుగకూడదని శాసించాము !

అదేమంటే, అది కాంగ్రెసుప్రభుత్వము. అది శ్రీ మాన్ రాజగోపాలాచార్యులవారి ఆంతు! ఇంకేమి కావాలి మన కింతకన్నా ?

మనకు మన ఆంధ్రజాతీయతాభివృద్ధికన్న, అప్పటికి సందర్భశూన్యమైన కాంగ్రెసుమీాది అభిమానం ముఖ్యమై

పోయింది! సహోదరులైన తెలంగాణా ప్రజలకన్న అరవ ప్రధాని దగ్గిరచుట్టమై పోయినాడు!

అందుచేతనే ఎవ్వరికీలేని కాన్‌స్టిట్యూషనలిజం మనకు అడ్డువచ్చింది. కాశ్మీరదేశస్థులకన్న మనకు హైదరాబాదు దూరమైపోయింది!

మన పరస్పరప్రేమానుబంధాన్ని దృఢపరచే ఆ మహదవకాశం అల్లా జారిపోయింది!

నిజానికి దీంట్లో కాంగ్రెసు తప్పు ఏమీ లేదు: అది తాను విశ్వసించిన పద్ధతి ననుసరించింది.

కాని ఆంధ్రులమైన మనం, సోదరాంధ్రులను గురించి అటువంటి అమూల్యావకాశాన్ని పోగొట్టుకోనడం, అంత వుపేక్ష వహించడం, ఎందుకు కలిగిందీ?—నిస్సంకోచంగా ఒక్క మాటలో చెప్పవచ్చు,—

మనకు స్థానికావసరాలకు కూడా, కాంగ్రెసు వినా స్వతంత్రశక్తి లేకపోవడంచేత! 'నాతిచరామి' అని మనం కాంగ్రెసునే నమ్మి వుండటంచేత!

కాని యావదాంధ్రులకూ ప్రతినిధి అయిన మన ఆంధ్రమహాసభే కలితీలేని ఆంధ్రవీరుల సంస్థ అనుకొందాము; అది స్వతంత్రంగా కొన్ని వుద్యమాలు నడిపి, కొంత త్యాగంచేసిందని మెచ్చుదాం; దానివల్ల అది స్వరాష్ట్రం తెప్పించిందనికాని, లేదా మద్రాసు శాసన సభలో మంచి

పార్టీ బలం సంపాదించిందనికాని వూహిద్దాం; ఆ హోదాకు తగినట్టు, దాని ఆజ్ఞకులోబడి ఆంధ్రత్వ రక్షణకొరకు ప్రచండ దీక్షాబద్ధులైన సుశిక్షిత సత్యాగ్రహ సైనికులు చెప్పతగినంతమంది వున్నారనికూడా అనుకొందాం.

అటువంటప్పుడు మనకు స్వరాష్ట్రం గొరటకి పూర్వమే ఎప్పుడో రాకుండావుండేదా? మన తెలంగాణా సోదరు లింత నిస్సహాయులై వుండేవారా? సర్కారులలో చీలిక నివ్వడానికి బదులు, మనం సమగ్రాంధ్ర నిర్మాణం చేయకుండావుంటే, నిజాము మనకు ధన్యవాదా లర్పిస్తూ వుండేవాడు కాడా?

కాని యిప్పుడేముందీ? ఆంధ్రమహాసభ కాంగ్రెసు మీద ఆధారపడివున్న ఉపగ్రహం! 33 ఏండ్లలో మనకు స్వరాష్ట్రం రాకపోగా, విశాఖ మచిలీ పట్టణాల మధ్యనున్న ఆంధ్రఖండాన్ని చీల్చి నిజాము కివ్వవలెననే పైత్యపు కేకలు వినుపిస్తున్నై.

వినుపించడమే కాదు: నిజంగా ఇచ్చినాకూడా ఇవ్వవచ్చు.

ఆశ్చర్యంలేదు.



# (౯) ఆత్మ బలి

కాంగ్రెసు బ్రిటిషుసామ్రాజ్యతత్వంమీద దౌర్జన్య రహితయుద్ధం చేస్తున్న యీ విపద్యుగంలో మనం రాష్ట్రీయ లాభనష్టాలు గుణించుకొంటూ సంచరించడం అంత సమంజసం కాదన్నమాట వాస్తవమే.

కాని ఇట్టి సందర్భంలోకూడా మనం నిష్పక్షపాతంగా పరిశీలించవలసిన విషయాలు కొన్ని వున్నై.

ఇంతవరకూ 'స్వ' అన్న పదం మరచి మన యావచ్ఛక్తినీ అఖిలభారత సమస్యలమీద ధారపోస్తూ వచ్చాం. కాని దానివల్ల కలుగుతున్న ఫలితా లెటువంటివి?—

మనం ఏ సంస్థ పేరిట స్వార్థం బొత్తుగా మరచి సంచరించామో, దాని పైవర్గాలలో మననిగురించి ఒక చులకన భావం ఏర్పడింది. మనమంటే, అలక్ష్యమూ, వెనుక వరుసలోకి నెట్టివేయబడడమూ సంభవించింది.

కనుకనే కాంగ్రెసు ౬౦ ఏండ్ల చరిత్రలో, ఎంత అర్హత కలిగి వున్నప్పటికీ ఒక్క ఆంధ్రుడూ అధ్యక్షుడు కాలేక పోవడమూ, ఆంధ్రరాష్ట్ర సమస్యకి తగిన ప్రాధాన్యత రాకపోవడమూ తటస్థించింది.

ఇందులో వాళ్ల తప్పేమీ లేదు! ఇది కలియుగం; స్వార్థరాహిత్యం తెలివి తక్కువగానూ, మంచితనం బల

హీనతగానూ పరిగణింపబడుతున్న రోజులివి. ఆ విషయం గ్రహించక, వెర్రిబాగుల వాళ్లమై, ఆత్మార్థం మరచి సంచరించిన మనదే దోషం! ఇది కాల మహాత్మ్యం!

విచక్షణలేని స్వార్థ రాహిత్యంవల్ల పై వర్గాలలో అలక్ష్యభావం కలగడంకన్న పెద్ద అనర్థకం ఇంకొకటి వుంది. అది, మనలో మానసిక బానిసత్వం ఏర్పడటం.

ఉదాహరణకి:—౧౯౪౦నాటి విషయం—ఎన్నడో అధ్యక్షపీఠం అలంకరించవలసిన పట్టాభికి కాంగ్రెసు వర్కింగు కమిటీలో స్థానం లేకుండా పోయింది! తప్పువున్నా లేకున్నా, ప్రొఫెసరు రంగా అంతటి నాయకుణ్ణి మహాత్ముడు బహిరంగంగా మందలించ గలిగాడు!

మనం కిక్కురు మనలేదు!

"ఇవి వ్యక్తిపరమైన ప్రమాదాలుకావు:

"ఇవి జాతీయ అవమానాలు!"

అని మనం గుర్తించలేక పోయాం!

ఇదే బెంగాలులో అయితే ఇల్లా జరిగివుండేదా?

అదివరకూ ఎంతోమంది వంగీయులు అధ్యక్షులై వున్నా, క్రమశిక్షణచర్య క్రింద దాని రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాన్నంతా రద్దుపరచినా, ఆనాడు బెంగాలుకి వర్కింగు కమిటీలో విశేష ప్రాతినిధ్యం! సుభాషచంద్రబోసు

కాంగ్రెసుమీద ఎంత విప్లవాత్మకంగా ప్రవర్తించినా, అతన్ని పల్లెత్తుమాట అనడానికి కొన్ని నెలల ఆలోచనలు!—

ఇటీవల ప్రకాశం ప్రధాని అయ్యే సందర్భంలో జరిగిన అల్లరి ఈ ఉదాహరణల పరంపరయొక్క తాజా నిదర్శనం. ఈ వుండు పచ్చి ఇంకా మానలేదు.— దీని పరిణామమున్నా ఇతడు ప్రధానిపదవి స్వీకరించడంతో తేలలేదని కూడా చెప్పవచ్చు — కనుక దీనిని గూర్చిన విమర్శ ప్రస్తుత మనుచితం; కాని ఒక్క విషయంమాత్రం ఎంతటి జడపదార్థానైనా చకితపరుస్తుంది:

కడపటికి ప్రధాని ఎవ్వరైనా, ఆంధ్రుల అభిమాన నాయకుణ్ణి ఈ సందర్భంలో ఇంత న్యూనతపరచే సాహసం కాంగ్రెసు నేతలకు ఎల్లాకలిగిందా, ఇంతటి దుస్థితికి వచ్చేవరకూ తెలుగు దేశం అజగరప్రాయమై ఎందుకు ఊరుకుందా, అన్న విషయంమాత్రం తెలుగుతనం వున్న ప్రతి కళేబరంలోనూ వెర్రి ఆవేశం కలిగించి తీరుతుంది!

ఉన్న రహస్యమేమంటే, ఇతరులకు ఆత్మగౌరవం రోమరోమానికీ అంటుకుపోయింది; మనకు బానిసబుద్ధి పంచేంద్రియాలలో జీర్ణించిపోయింది!

మనని అధ్యక్షుణ్ణి చేసినా, గంగలో తోసినా వాళ్లే చెయ్యాలి: మనకు స్వరాష్ట్రం ఇచ్చినా, వున్నదానిని చీల్చి ఇతరులకి పంచిపెట్టినా వాళ్లే చెయ్యాలి! మనమల్లా మెల్ల

కాలం దాసానుదాసులమై వాళ్లవైపు పైకిచూస్తూ వుండాలి, ఎప్పుడు ఏమి ఆజ్ఞ ఇస్తారో మహాప్రభువులు అని!

ఇటువంటి మానసిక ప్రవృత్తి, జనసామాన్యంలో,

ప్రత్యేకంగా, సంఘానికి జీవగర్ర అయిన యువ జనంలో,

కలగడం జాతికి ఎంత అనర్థకమో మనం వూహించు కో గలిగితే, ఇక వేరే ఆలోచనలకు తావుండదు.—

తరువాత, యావద్భారత సమస్యలమీద వినియోగించిన మనశక్తిని ఇంకేవిధంగానైనా వుపయోగించివున్నట్లైతే, అది భారతజాతీయతకు భంగంలేని ఆంధ్రోన్నతికి అనుకూలించి వుండేదా అన్నది రెండవప్రశ్న.

ఒక్క బార్డోలీ తాలూకా అలజడికి, యావద్భారతమూ సహాయం చేయడములో, ఒక్క విశ్వభారతికి ఆ సేతు హిమాచల పర్యంతమూ కానుక లర్పించడములో, ఒక్క నిజాముసంస్థాన సత్యాగ్రహానికి పంజాబునుంచీ కాశ్మీరమునుంచీ స్వచ్ఛంద సేవకులు వేలసంఖ్యలో తరలిరావడములో,— ఈ పరమార్థమే ఇమిడివుంది. ఇవన్నీ చాలవరకు స్థానికోద్యమాలు. కాని వాటికి అఖిలభారత వర్ణం పూశారు అక్కడి నాయకులు. వాటివల్ల భారతజాతీయ గౌరవం ఎమీా మొక్కవోలేదు: పైగా స్థానికశక్తి విధిగా అభివృద్ధి చెందింది.

మనకు కూడా ఆలోచనా స్వాతంత్ర్యం వున్నట్లైతే, ఆంధ్రరాష్ట్రం విషయంలోనూ ఇటువంటిపని ఈవర కెప్పుడో చేసివుండేవాళ్ళం!—

ఇంకొక సంగతి: వ్యవహారం ముదిరి ఆత్మవిషయానికీ కాంగ్రెసు పద్ధతికీ సంఘర్షణ తటస్థించినపుడు అందరూ మనవలెనే స్వార్థాన్ని పూర్తిగా చంపుకొంటున్నారేమో కూడా ఆలోచించాలి. ''కమ్యూనల్ ఎవార్డు''ను రద్దు పర పించడానికి క్రిందటి కేంద్రశాసనసభ (౧౯౩౫) లో ఏర్పడిన 'కాంగ్రెసు నేషనలిస్టు' పక్షు మిందు కొక నిదర్శనం. ఇది ''ఎవార్డు'' పట్ల కాంగ్రెసు వైఖరిని నిరసించడానికి దాదాపు పూర్తిగా బెంగాలుచేత సృష్టించి నిర్వహింపబడిన పక్షం.

ఇదేవిధంగా వ్యక్తిపరంగా కూడా, తను విశ్వసించిన అహింసాసిద్ధాంతానికి మోసం కలుగుతున్నదని తలచి (౧౯౪౦ ప్రాంతంలో) తన ఖుదైఖిద్మాట్గరువర్గంతో కాంగ్రెసునుంచీ వేరుపడడానికి 'సరిహద్దుగాంధి' సిద్ధపడటం కూడా పేర్కొనవచ్చు.

ఇటువంటి నిదర్శనా లెన్నైనా ఈయవచ్చు. కాని ఆంధ్రరాష్ట్ర సమస్య సందర్భంలో మాత్రం అవి మృగ్యం! కాంగ్రెసుతో మన మే విషయంలోనన్నా ఏకీభవింపలే నపుడు, మనం పూర్తిగా ఆత్మబలికి సిద్ధపడతామేగాని, ఆంధ్రవ్యక్తిత్వాన్ని భారతజాతీయతతో సరియైన దామా షాలో సమన్వయించే ఒక దివ్యపథం కనిపెట్టం.

అందువల్ల మనం అనుభవిస్తున్నదీ, ఇక అనుభవించ బోయేదీ ఒక విధంగా కాదు!

# (౧౦) ద్వితీయ ప్రపంచ సంగ్రామము: ఆంధ్రరాష్ట్రము

నష్టదాయకమైన మన అమాయకత్వానికి ఎన్ని నిదర్శనాలైనా చూపించవచ్చు. అందులో గత ద్వితీయ ప్రపంచసంగ్రామాన్ని గూర్చిన మనవైఖరి ఒకటి.

ఆ యుద్ధానికీ ఆంధ్రరాష్ట్రనిర్మాణానికీ ఏదో పెద్ద బ్రహ్మాండమైన అవినాభావసంబంధముందనీ, అందుచేత అది సమాప్తిఅయ్యేవరకూ తెలుగుసీమ స్వరాష్ట్రాన్ని తల పెట్టడం ఘోరపాతకమనీ ఒక అభిప్రాయం మనలో బాగా వ్యాపించి వుండేది. కాని,

(౧) ఆంధ్రరాష్ట్రనిర్మాణంవల్ల మిత్రమండలి యుద్ధ నిర్వహణానికి ఆర్థికంగా ఏదైనా అపారనష్టం సంభవించి వుండేదా అంటే,

మన పన్నెండు జిల్లాలూ వేరుపడడానికి విదేశాల నుంచీ ఏమీ సరుకులు రానక్కరలేదు; ఓడలలో యంత్ర సామగ్రి ఏమీ దిగుమతి కానక్కరలేదు; మనం అప్పటికి క్రొత్త ఎన్నికలను కోరలేదు; అదనపు గవర్నరుని అడగ లేదు; చెన్నపురినే రాజధానీనగరం చేసికొంటామన్నాము; పాత శాసనసభా భవనాలనే వుపయోగించుకొనడానికి సిద్ధపడ్డాము.

కనుక దీనివల్ల భారతప్రభుత్వాదాయానికి వచ్చే లోటు ఏమీ వుండేదికాదు; బ్రిటిషు ప్రభుత్వము నిత్యమూ యుద్ధానికిచేసే వ్యయంలో ఒక దమ్మిడీ ఇటు ఖర్చుపెట్ట వలసిన అగత్యం పట్టేదికాదు; అన్నిటికన్న ముఖ్యం, దీని వల్ల యుద్ధసహాయనిధి వసూళ్లు ఏమాత్రమూ కుంగిపోయేవి కావు.

(౨) పోనీ, రాష్ట్రనిర్మాణంవల్ల ఆర్థిక వ్యవహారాల కన్న అతి ముఖ్యమైన సైనిక విషయాలలో పెద్ద ప్రమాదమేమైనా సంభవించివుండేదా అంటే,

మనకు రాజకీయ రాష్ట్రాలతో ఏమీ సంబంధం లేకుండా, సైనిక మండలా లేర్పడివున్నై. ఒక్కొక్క మండలంలో కొన్ని రాజధానులూ, కొన్ని వలసరాజ్యాలూ, కొన్ని పాండిచేరివంటి మిత్రరాజ్యభాగాలూ కలిసివున్నై. అందుచేత అదనంగా ఒక్క ఆంధ్రరాష్ట్రం ఏర్పడడం మూలాన వారి మిలిటరీ మండల నిర్మాణం ఏమీ తారుమారయ్యేది కాదు.

కనుక దీనివల్ల భారత రక్షణ శ్రేణుల బిగువు ఏమీ సడలిపోయేది కాదు! మిత్ర మండలివారి ప్రపంచ సైనిక వ్యూహాలలో కొత్త సమస్యలేమీ వుద్భవించి వుండేవి కావు; యూరపు యుద్ధరంగాన్ని విడిచిపెట్టి ఒక్క తెల్ల సైనికుడు ఇక్కడికి రానక్కరపడేది కాదు; ఇక్కడ నుండి వెళ్లే ఒక్క నల్ల సిపాయి ఆగిపోవలసివచ్చేది కాదు.

(3) లేక ఈ ఆంధ్రరాష్ట్ర నిర్మాణంవల్ల గొప్ప రాజకీయ కల్లోలాలు బయలుదేరి, మిత్ర రాజ్యాలలో బ్రిటిషు నైతికబలాని కేమైనా భంగపాటు గలిగించేదేమో అంటే, అది కేవలం మస్తిష్క రోగంవున్నవారు నమ్మ వలసిందే కాని మనం విశ్వసించలేము.

పైగా, మన రాష్ట్ర నిర్మాణావశ్యకతను గురించి సైమను కమిషను అనుకూల్యతను సూచించింది; శాసన సభలు ఆమోదించి తీర్మానించినై; దీనికి మన ప్రముఖ రాజకీయ సంస్థలలో, కాంగ్రెసు ఆశీర్వచనముంది; ముస్లిం లీగు అభ్యంతరం లేదు; హిందూ మహాసభ సానుభూతి వుంది. ఇక నెవరిది అభ్యంతరం?

కనుక, మన రాష్ట్ర నిర్మాణంవల్ల భారత ప్రభుత్వ పరిపాలనా విధానంలో కొద్దిపాటి అంతర్విభజన జరిగివుండేది కాని,

బ్రిటిషు సామ్రాజ్య ధురంధరుల ధ్యానాన్ని యుద్ధం నుండి మరలించ వలసినంత ఆర్థిక విప్లవాలేమీ తటస్థించేవి కావు; భారతదేశంలో ప్రమాదకరమైన ఎటువంటి రాజకీయ సమస్యలూ ఉదయించేవి కావు! వారి మిలిటరీ చర్చల ప్రసక్తి అసలే వుండేదికాదు; వారి ప్రపంచ వ్యూహాలకు భంగం కలిగేది కాదు; హిట్లరు దుష్ప్రచారానికి ఇది ఏమీ వుపయోగించేది కాదు; వారి యుద్ధ వ్యయాన్ని ఒక్క దమ్మిడీ ఎక్కువచేసేది కాదు; ఇక నేమిటి మన రాష్ట్ర

నిర్మాణానికీ యుద్ధానికీ వున్న ఆ అవినాభావ అభేద్య సంబంధం?

మన అమాయకత్వమూ, మన బలహీనతా తప్ప వేరే ఏమీ లేదు!

మనం స్వతంత్రాలోచన లేక ఇతరులని సునాయా సంగా విశ్వసిస్తాము. ఈ యుద్ధ సమయంలో రాష్ట్ర విషయం తలపెట్టడం కూడదని కొందరు మహానాయకులంటే మనం మారుపలుకక తథాస్తు అన్నాం. కాని "ఈ యుద్ధ సమయం లోనే బ్రిటిషు సామ్రాజ్య వివిధ భాగాలలో రాజకీయ పరి వర్తనాలెన్ని జరగటల్లేదు? అదే విధంగా మా రాష్ట్ర విభజన కూడా ఎందుకు జరగకూడదు?" అని ఒక్కరం అడగలేదు!

మన అమాయకత్వాన్ని ఇంతటితో ఆగనీక, ఇంత కన్న విచారకరమైన ఇంకొక అపోహకి తావిచ్చాము మన వూహా సౌధాల్లో! అది ఏమంటే, యుద్ధానంతరం అతి శీఘ్రంగా బ్రిటిషువారు (మనని పిలిచి, సత్కరించి) మన రాష్ట్రనిర్మాణం చేసిపెడతారని అనుకోవడం.

కాని ఇది హిమాలయ పర్వత మంతటి భ్రాంతి అని వేరే చెప్ప నక్కరలేదు!

ఎందుకంటే మన కటువంటి అభయహస్తం ద్వం ద్వార్థ రహితమైన తేట మాటల్లో బాధ్యతగల ఏ ప్రభు త్వాధికారి యిచ్చాడు? బ్రిటిషువారికీ విషయంలో అను

కూల నిశ్చయముంటే, యుద్ధ సమయంలోనైనా వారు మన కోరిక సఫలపరచేవారే; లేక బడ్జెటు విడదీయమన్న ఆంధ్ర మహాసభ వారి అతి సామాన్యమైన విజ్ఞాపననైనా మన్నించి వుండేవారే; లేక కనీసం యుద్ధానంతర పునర్నిర్మాణానికై ఏర్పడ్డ అసంఖ్యోపసంఘాలలో మన రాష్ట్ర విభజన నిమిత్తం కూడా ఏదో ఒక వుపసంఘ నియామకం జరిగివుండేదే! కాని మచ్చుకైనా అటువంటి సన్నాహమేమీ కనుపించలేదు.

ఇది సాధారణమైన భ్రాంతికాదు. యుద్ధానంతరం మన ఆశ సఫలమౌతుందని అంధవిశ్వాసంతో నిశ్చింతులమై వుండిపోయాం కాని, ఒకవేళ విఫలమైతే ఏమి జెయ్యాలని ఒక్క అడుగు దూరదృష్టితో ఆలోచించలేదు. అందుచేత యుద్ధం ముగిసినపిదప మళ్లీ కింకర్తవ్యతా మూఢులమై, మహజర్లతో, విజ్ఞాపనలతో, కాంగ్రెసు వర్కింగు కమిటీ దగ్గరకు రాయబారాలతో, అరవ ప్రధాని ఇచ్చే హామీలతో సంతృప్తి పడడంతో పని ప్రారంభింపవలసిన స్థితిలోనే మనం వుండడం తటస్థించింది.

ఇటువంటి మానసికావస్థని కేవలం భ్రాంతి అనడానికి వీలులేదు: ఇది జాతిని అలసత్వంలో ముంచి నిర్వీర్యపరచే బహు ప్రమాద భరితమైన ఒక గుణదోషం!

ఏపనీ చేయలేని అసమర్థులం గనుక వారు మనలని నిర్నిమిత్తులుగ, మన సమస్యలని అతి అప్రధానాలుగ తోసివేశారు కాని,

మన అందరిలో రాష్ట్రవేదన తీవ్రరూపం దాల్చి ప్రజ్వలిస్తూవుంటే, మనలో నూటికి పదిమంది చొప్పున (30 లక్షల మంది) రాష్ట్రంకొరకు ఆహుతి కాదలచుకొని, ఒకే ఒక నాయకుడి ఆజ్ఞానుబద్ధులై, సర్వానికీ సంసిద్ధులై నిలుచుంటే,

ఈ యుద్ధావసరాలన్నీ ఆవిరిలాగ ఒక్క దెబ్బలో ఎగిరిపోయేవి కావూ ? మనం అడగకుండానే ఆంధ్రరాష్ట్రం ఒక్క అర నిమిషంలో ఊడిపడేది కాదూ ?—

రాష్ట్రనిర్మాణానికి యుద్ధసమయంలో మనకున్న అనర్హతగాని, యుద్ధానంతరం మనకు వచ్చిపడ్డ యోగ్యత గాని ఏమీ లేదు.

అప్పుడుగాని ఇప్పుడుగాని బ్రిటిషు ప్రభుత్వం, తనకు ఏదైనా అవసరమైతేనో, లేక మన ఒత్తిడివల్ల అనివార్యమైతేనో తప్ప, తనంతట తను మన రాష్ట్రాభ్యుదయానికై ఏమీ తాపత్రయపడదని స్పష్టంగా తెలిసికొని, మనం దానికి ప్రతిక్రియయైన కార్యక్రమం ఆలోచించి ఆచరణలో పెట్టడం సముచితం.

దానికి, ఆజ్ఞలకొరకు, కాంగ్రెసు లేక ప్రభుత్వం వైపు చూచే మన స్తత్వం పూర్తిగా నశించి, దాని స్థానే, "కాంగ్రెసు వద్దన్నా, ప్రభుత్వం ఇవ్వనన్నా, బ్రహ్మదేవుడు అడ్డుపడినా, నేను సర్వాంగ సమగ్రమైన నా ఆంధ్రరాష్ట్రాన్ని సృష్టించి పెంపొందించి తీరుతాను" అనే దృఢశపథంగల

ఆంధ్ర వీరులు మనలో అసంఖ్యాకంగా పెరిగిపోవాలి. ఆంధ్ర మహాసభ అటువంటి వారికే స్థానమిచ్చి అటువంటి వారి చేతనే నడుపబడాలి. వారందరూ ఇదే జీవితప్రధానాశయంగా గల ఒక నాయకుడి వెనుక నడవాలి.

అటువంటి అంగనిర్మాణమే మన కైవల్య కైనా మోక్షదాయకం: అదే మనకు యథార్థశక్తి, మన అసలైన చైతన్యం—అని మనం గ్రహించాలి. ఆంధ్రమహాసభ దాని సృష్టికీ, పెంపుకీ పూనుకోవాలి.



# (౧౧) పాకిస్థానము : ఆంధ్రరాష్ట్రము

మనకు పాకిస్థాను సమస్య లేనే లేదని మన భ్రాంతి !

అది మహమ్మదీయు లధిక సంఖ్యాకులుగావుండే బెంగాలు, పంజాబు మొదలైన రాష్ట్రాలకేగాని మనకు కాదు; మన మొత్తం జనాభాలో ముస్లిం మిత్రులు షుమారు నూటికి పదిమంది మాత్రమే; వారైనా మనతో సోదరభావంతో మెలగుతూ వుంటారేగాని మాతృగర్భ విచ్ఛేదనానికి పూనుకొనే దృక్పథం వారిలో బొత్తిగా లేదు. కనుక పాకిస్థానువిషయమై మనం నిర్విచారులమై, గుండెల మీద చేయివేసికొని నిద్రించవచ్చునని ఆంధ్రమహాసభాధ్యక్షుల మొదలు అవ్యక్త ఆటవిక ప్రజలవరకూ దాదాపు అందరికీ ఒకటే అభిప్రాయం !

కాని నిజంమాత్రం ఈ వూహకి అవతలివైపునవుంది!

హైదరాబాదు సంస్థానం వైపు ఒకమారు దృష్టిని మరలిస్తే ఈ విషయం బోధపడుతుంది.

ఈ రాష్ట్రంలో స్థూలంగా నూటికి ౮౬ మంది హిందువులు, ౧౧ మంది మహమ్మదీయులు, 3 గురు ఇతరులు.

కాని పెద్ద ఉద్యోగాలలో నూటికి షుమారు ౯౫ మహమ్మదీయులవి. పేరెన్నికగన్న పెద్ద జాగీర్లలో నూటికి ౭౦ వారివి. ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గంలో ౫ స్థానాలు వారివి; ౧ హిందువులది. నూతన సంస్కరణల ప్రకారం

కూడా శాసనసభలో నూటికి ౫౦ స్థానాలు వారివై యుండటం విధి.

ప్రతి ప్రభుత్వ శాఖాధికారి ఒక మహమ్మదీయుడు. మిలిటరీ పోలీసు శాఖల విషయం చెప్పనే అక్కరలేదు; అవి యించుమించు ఆపాదమస్తకమూ వారి హస్తగతము. ఇక ప్రముఖవ్యాపారసంస్థలలో వారిది పైచేయి; ప్రధాన పరిశ్రమలలో వారిది నాయకత్వము; వార్తా పత్రికా ప్రచురణంలో వారిది ప్రాజాపత్యము; రేడియో కార్యాలయంలో వారిది పలుకుబడి.

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉర్దూమయం. హైస్కూళ్ళలోకూడ పాఠం బోధించవలసింది ఉర్దూలో: చివరకు ప్రాథమిక పాఠశాలల్లోకూడ ఉర్దూ ప్రవేశపెట్టవలెనని ప్రయత్నం! విశ్వవిద్యాలయంలో సగం కన్న ఎక్కువమంది ముస్లిం విద్యార్థులు. అందులో, ఏ కారణంచేత నేమి, ప్రవేశం లభించక అనేక హిందూబాలురు ఇతర విశ్వవిద్యాలయాలకు పోవలసిన కడగండ్లు! విదేశ విద్యార్థి వేతనాలకు ముస్లిం విద్యార్థులు వారసులు. అందుచేత చదువు ముగించి తిరిగి వచ్చినపిదప పెద్ద ఉద్యోగాలు వారికి!

హిందూమత ఎండోమెంటు సలహాసంఘంలో హిందూ ముసల్మానులది సరిసమాన సంఖ్య! మశీదులు నవ్యచైతన్యంతో కళకళ లాడుతూవుంటే, దేవాలయాలు శిథిలావస్థలో మాటుపడి పోతూవుంటై. విశ్వవిద్యాలయంలో,

ప్రజోద్యానాలలో, పట్టణం పెరిగిన క్రొత్త పేటలలో, ప్రతి సర్వసార్వజనిక సంస్థ సమీపంలో మశీదులేగాని మచ్చుకైనా దేవాలయాలు కనుపించవు.

వారములో 'జుమ్మా' (శుక్రవారం) ప్రభుత్వ సెలవు దినము. మహమ్మదీయుల పండుగల ననుసరించి కచేరీలు పనిచేసేకాలం మారుతూ వుంటుంది. వారి రంజాన్, మొహర్రం పండుగలకు వరుసగా ౧౨, ౧౦ రోజులు సెలవులు. మన దసరా, దీపావళీలకు రెండేసి రోజులు. నడి బజారులో వున్న మశీదుముందు పట్టపగటివేళ కూడా హిందూ మేళము వినిపించకూడదు; కాని రంజాను నెల ౩౦ రాత్రులూ, మహమ్మదీయులను మేల్కొల్పే డప్పుల వూరేగింపులు తెల్లవారుజామున రెండుగంటలనుంచీ హిందువులకు నిద్రపట్టకుండా చేయవచ్చు! ప్రభుత్వభాష ఉర్దూ. రాజ దర్బారులలో, ప్రభుత్వ కార్యాలయాలలో, విశ్వవిద్యాలయ విద్యార్థులలో, చట్ట సమ్మతమైన వేషము, మహమ్మదీయ వేషము (షేర్వాణీ, టోపి). హిందూ పద్ధతి (ధోవతి, ఉత్తరీయము) నిషిద్ధము! ఏవైపు చూచినా ముస్లిం వేషము; ఏమూల విన్నా ముస్లింభాష; ఏవీధి కేగినా ముస్లిం సంస్కృతి; ఏది కోరుకొన్నా ముస్లిం నాగరికత!

ఇన్ని మాటలెందుకు? 'ఇది ఒక ముస్లింరాజ్యము' (Islamic State) అని ప్రభుత్వ ప్రకటన!

దీనినంతటిని ఏమంటారు? ౮౬% హిందువుల నడిగడ్డ మీాద యీా ౧౧% మహమ్మదీయుల విశ్వతాండవానికి ఏమని పేరు ?

అనుమానమెందుకు ? ఇది ఆ పాకిస్థాన్ కబంధుని దక్షిణహస్తం ! ఇది జిన్నా నిర్వచించలేని, గాంధీ ఊహించలేని ఆ అదృశ్యరాజ్యాంగంయొక్క ప్రత్యక్షస్వరూపం !

కాని ఒకటే భేదముంది. జిన్నా పాకిస్థానము ముస్లింలధికసంఖ్యాకులుగనున్న ప్రాంతాలకు; ఇది ముస్లింలు అత్యల్పసంఖ్యాకులైవున్నచోట ! ఔత్తరాహులు వారి పాకిస్థానము ఎప్పుడో రాగలదని అలజడి పడుతున్నారు; మనము ఈ పాకిస్థానము ఎప్పుడోవచ్చి పాదుకుపోయివున్నా నిర్విచారులమై వున్నాము !

హైదరాబాదులో వున్న మహారాష్ట్ర కర్ణాటకులకు లేని ఈ విచారం మన కెందుకని అడగవచ్చు.

వారికీ వుంది. కాని అంతకన్న ముఖ్యమైన కారణమేమంటే, నిజాంరాష్ట్రంలో ఆంధ్రులసంఖ్యాబలము అందరికన్న ఎక్కువ. అందుచేత అక్కడి ఈ నష్టతాంబూలము పరిగ్రహించడంలో మనమే జ్యేష్ఠభ్రాతలము !

అయితే ఈసమస్య నెదుర్కొనే మార్గమేమిటి ?

భారతప్రభుత్వం ఈ సందర్భంలో జోక్యం కలిగించుకోనడం అసంభవం. తమ "విశ్వసనీయుడైన మిత్రు"నికి

సంబంధించిన ఇంతటి ప్రధానవిషయంలో ఏవిధమైన చర్య తీసికొనడానికీ బ్రిటిషువారు సాహసించరు.

కాంగ్రెసును నమ్ముకొంటే బ్రిటిషు ఆంధ్రులమైన మనకే స్వరాష్ట్రము ఎండమావులై పోతోంది. ఇక తెలంగాణాప్రజల స్వపరిపాలననుగురించి వేరే చెప్పనవసరం లేదు.

కనుక ఎవరు ఉద్ధారకులు? ఈ భారం మోయగల, మోయవలసిన వారెవరు నిజంగా?

భారతజాతీయతకు భంగము వాటిల్లనీయని ఆంధ్రోద్ధరణమే తన జీవితాశయమైతే, ౫౦ లక్షల తెలంగాణాప్రజల దుర్దశను గురించి తాపత్రయపడవలసిన అవసరం ఆంధ్ర మహాసభ కెంతైనావుంది.

కాని ఈసంస్థ కాంగ్రెసుప్రతిబింబము. శ్రీ కృష్ణుని నిర్యాణానంతరము అర్జునుడు నిర్వీర్యుడైనట్లు, కాంగ్రెసు శక్తిని తననుండి ఉపసంహరిస్తే, ఆంధ్రమహాసభ నామ మాత్రావశేష మౌతుంది.

కాని అల్లా కాకుండ తనకొక విశిష్టకార్యక్రమం, ఊరూర శాఖలుగల అంగనిర్మాణం, తనసందేశప్రచారార్థమే నడుపబడు వార్తాపత్రికలు, తన ప్రత్యేక స్వచ్ఛంద సేవక దళం, స్థానికసంస్థలలో, శాసనసభలలో తన ప్రతినిధులు, మొదలైన హంగులను ఆంధ్రమహాసభ ఈపాటి కేర్పరచు కొన్నట్లయితే, దేశంలో తనశక్తి గణనీయమైయుండేది.

స్వదేశసంస్థానాల అంతఃపరిపాలన సందర్భంలోనేమి, భాషాప్రయుక్తమైన సమగ్రరాష్ట్రాల నిర్మాణం విషయంలోనేమి, కాంగ్రెసు జోక్యంకలిగించుకోనేస్థితి ఇప్పట్లో రాకపోవచ్చు. కనుక ఈ రెండు సమస్యల సమ్యక్పరిష్కారానికి మదరాసు శాసనసభలో ఆంధ్రకాంగ్రెసు నాయకులకన్న ఆంధ్రమహాసభ ప్రతినిధులే సమర్థులు కాగలరు. వారి శక్తికి గూడ మించి ప్రత్యక్షచర్య లవసరమైనపుడు మహాసభ క్రమశిక్షణలో పెరిగే స్వచ్ఛందసేవకదళం రణరంగంలో ప్రవేశించగలదు.

ఆంధ్రపాకిస్థానువిచ్ఛేదనావశ్యకత అనే వ్యాజం చేతనైనా, "స్వదేశసంస్థానాలలో స్వయంపరిపాలన" అనే ఉద్యమానికి నాయకత్వం వహించి, ఆంధ్రమహాసభ అఖిల భారతఖ్యాతి గడించగల అవకాశం యిప్పటికీ వుంది.



# (౧౨) పరిశ్రమలు - ఆంధ్రరాష్ట్రము

పాశ్చాత్య ప్రపంచానికి భారతదేశం ఎంత వెనుకపడి వుందో, భరతఖండంలో ఆంధ్రభాగం అంత అడుగు మెట్టున వుంది.

ప్రపంచంలో తయారయే ప్రతి వస్తువూ - ఆహార పదార్థం మొదలు ఆయుధసామగ్రి వరకూ—, ప్రచారం లోకి తీసికొనిరాబడే ప్రతి కొత్త ఆలోచనా - అట్లాంటిక్ ఛార్టరు మొదలు అణువుబాంబు వరకూ—, మానవ కళ్యాణానికి తోడ్పడే ప్రతి నూతన విజ్ఞాన గ్రంథమూ— బాలశిక్ష మొదలు బ్రహ్మజ్ఞానదీపిక వరకూ—, అన్నీ పాశ్చాత్యుడు ప్రసాదిస్తేనే గాని భారతావనికి మోక్షం లేదు!

హిందూదేశంలో ఆంధ్రరాష్ట్రవిషయం కూడా అంతే. వస్తువులు, ఊహాలు, నాయకులు, సమస్తమూ యిక్కడికి దిగుమతేగాని, ఇక్కడినుంచి ఎగుమతి అన్నమాట లేదు! మనకు వస్త్రాలొకడు, అలంకరణ సామగ్రి ఇంకొకడు, ఔషధాలు వేరొకడు, ఇల్లూ ప్రొద్దున మొహంపుల్ల మొదలు రాత్రి దీపపుప్రమిద వరకూ, అన్యరాష్ట్రీయులు అందిస్తేనే గాని మనకు రోజు గడవదు. అంతేకాదు: కాంగ్రెసు మొదలు కమ్యూనిస్టుపార్టీ వరకూ గల సకల రాజ

కీయ కక్షులూ, వాటి నూతన సిద్ధాంతాలూ, వాటి ప్రచారక గ్రంథాలూ, వాటి ప్రధానకార్యాలయాలూ, అన్నీ పరరాష్ట్రాలని తమ మాతృస్థానంగా చేసికొని, మన ఆంధ్రదేశంలో వలసలేర్పరచుకొన్నవే గాని, ఇక్కడి నుంచి నది అటు ప్రవహించినదెప్పుడూ లేదు! చివరకు రామకృష్ణపరమహంస మొదలు సాయిబాబావరకు గల మత ప్రవక్తలుగూడ మనకు పైనుండి రావలసిందే!

ఏమిటీ చిత్రం! ఇతరులు మనకంటె అంత మేధావంతులా? మనలోవలె ఐక్యతాభంగం కలుగజేసే కుల కక్షులూ, మత విద్వేషాలూ వాళ్ళలోకూడా లేవా? మన కున్న నైసర్గికసంపదకన్న వారిదేవిధంగానైనా గొప్పదా? బ్రిటిషుప్రభువులు పక్షపాతం వహించి మనల నణగద్రొక్కి వారిని ప్రోత్సహిస్తున్నారా? మరి ఏమీ లేనప్పుడు, అన్యరాష్ట్రీయులకూ మనకూ మధ్య ఇంత తారతమ్యం ఎల్లా వచ్చింది?

జాతీయ ఔన్నత్యానికి అవసరమైన స్వాతంత్ర్యాలోచనా, దీక్షా, మనలో బొత్తుగా లేనిమాట వాస్తవం! కాని మన నిమ్నస్థితికి ఇంకొక ముఖ్యకారణం కూడా వుంది. అది ఏమంటే, పారిశ్రామికంగా మనం ఏమీ అభివృద్ధి కాకపోవడం.

దేశంయొక్క అన్ని ఔన్నత్యాలకీ ఆధారభూతం పారిశ్రామికాభివృద్ధి. భారీపరిశ్రమలకి ఆటపట్టైన ఏ రాష్ట్రమైనా ఇతర రాష్ట్రాలకు తనదొక దమ్మిడీపోనివ్వ నవసర

ముండదు సరికదా, వాటినుండి నిరంతర కనకవాహినిని తనవైపు ప్రవహింపజేసికోగల్గుతుంది. ఈ ప్రవాహం కుబేరుని మరింత కుబేరునిగా, కుచేలుని మరింత కుచేలునిగా చేసి వదలిపెడుతుంది! దీనివల్ల పారిశ్రామిక రాష్ట్రానికి జీర్ణముకానంత ధనం పోగై, దానితో అది తనయాజమాన్యం క్రింద క్రొత్త పరిశ్రమలో, క్రొత్త వైజ్ఞానిక కళా కేంద్రాలో, క్రొత్త రాజకీయ కక్షలో లేవదీసి తను నాయకత్వము వహించడమూ,—కృషీవల రాష్ట్రం తన కున్న భూస్వామ్యము కూడా పారిశ్రామికునకమ్ముకొని భుక్తికిలేని నిరుపేదగా మారి, పారిశ్రామికుడు విధించే ఏ షరతుమీదైనా అతని దగ్గర సేవకావృత్తి కొప్పుకొనడం తటస్థిస్తుంది. ఇక ఈ పరిస్థితులలో 'విస్సన్న చెప్పిందే వేదము' కాక ఏమాతుంది? అన్ని విషయాలలోను పారిశ్రామిక రాష్ట్రానిదే పైచేయి. దానిమాటే వేదవాక్యము; దాని నడకే నాయకత్వము!

దీనినిబట్టి వాటి నాయకత్వము డంబాచారమనీ, వాటి ఘనత మిథ్య అనీ, ఎన్నటికీ అర్థంచేసికోకూడదు. నిజానికి వాటిలోనే ఎక్కువ గొప్పతనం పుట్టి పెరిగే అవకాశాలుంటాయి. ఎందుచేతనంటే, పారిశ్రామిక రాష్ట్రాలు 'రెక్కాడిన గాని డొక్కాడని' కష్టజీవులనే గాక, యావజ్జీవమూ రాజలాంఛనాలతో విరామమనుభవింప గల అగర్భశ్రీమంతుల నెందరినో తయారుచేస్తూవుంటాయి. వారిలో కొంద

రైనా తమ కాలాన్ని వ్యర్థపుచ్చక ఉన్నత విద్యల నభ్యసించీ, తమ అభిమాన శాస్త్రాలలో పరిశోధనలు సలిపీ, విదేశ సంచారాలుచేసీ, దేశనాయకత్వానికి విధిగా అర్హులయ్యేవుంటారు.

అదీగాక, పరిశ్రమలున్న చోటనే పెద్ద పట్టణాలు అభివృద్ధి అవుతవి. వాటితో ఆధునిక నాగరక జీవితమూ, దాని కష్టసుఖాలూ, వాటివల్ల ఏర్పడే క్రమశిక్షణా, పెంపొందుతవి. విశ్వవిద్యాలయాలుగాని, విమానాశ్రయాలుగాని అక్కడే ఏర్పడాలి: నరేంద్రమండలి సమావేశాలుగాని, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులు గాని అక్కడే సమకూడాలి; విదేశ వ్యవహారాలుగాని, వివిధాయుధ సంఘర్షణలుగాని అక్కడే జరగాలి. కనుకనే నాగరక జీవితంలో వుండే అష్టైశ్వర్యాలూ, సకల సమస్యలూ, పారిశ్రామిక ప్రాధాన్యతగల నగరాలలో కనుపిస్తూవుంటవి. ఇక ఆధునిక యుగ నాయకత్వము ఆ నగరాలనుండి బయలుదేరడంలో ఆశ్చర్యం ఏముంది?

అదేవిధంగా ఆంధ్రుల విశిష్టత అభివృద్ధిపొంది, పరరాష్ట్రాలలోకికూడా మన నాయకత్వం వ్యాపించాలంటే, కేవలమాంధ్రులదై హిందూదేశంలో ప్రథమశ్రేణికి చెందిన ఒక మహానగరమూ, దానిలో విధిగా ఒక ముఖ్య అంగమై కనుపించే మొదటి తరగతి ధనికవర్గమూ, కనీసం ఒక్కచోట

నైనా తయారుకావాలి. దాని కంతటికీ భారీ పరిశ్రమల వ్యాప్తి కీలకం.

మనలో స్వతంత్రాలోచనవుంటే,—బెంగాలుహిందువులకూ, పంజాబుశిక్కులకూ, అఖండ హిందూస్తానము ఎటువంటిదో, మనకు పారిశ్రామిక విప్లవం అటువంటిది! కాని ఎప్పుడైనాగాని వారి పాకిస్థాను ఖండన నినాదం ఇంత దూరానవున్న మనకు, ఇక్కడ వినుపిస్తూం దేగాని, మన పారిశ్రామిక హైన్యతా నిర్మూలనాన్ని గురించి మనం వేసే కేక వారి కేమాత్రం వినిపిస్తోంది? కనీసం అది మన ఆంధ్రరాష్ట్రంలో నైనా వినిపిస్తోందా? అసలు ఆ కేక వేసేవారున్నారా?

ఇంత తాపీగా కూర్చోవడానికి మన తెలుగుసీమ ఏ స్థితిలోవుంది? ఇతరులు మిల్లు గుడ్డలతో మనని దోచుకొనిపోతూవుంటే మనం తక్లీ వ్రత నిష్ఠా గరిష్ఠులమై వున్నాం! వారు రైల్వే ఇంజన్లు తయారు చేస్తూవుంటే, మనం రెండెడ్ల బండ్ల పందెములతో కాలక్షేపం చేస్తున్నాం! వారు విమాన నిర్మాణానికై యత్నిస్తూవుంటే, మనం అవి పైన ఎగురుతే చూడగలిగే భాగ్యానికై నిరీక్షిస్తున్నాం! ఇక మనలో మహానగరా లెల్లా అభివృద్ధి కాగలవు? కోటీశ్వరు లెల్లా పుట్టగలరు? పరిశ్రమల వ్యాప్తివల్ల దేశానికి సహజంగా లభ్యమయ్యే ఆర్థిక వైజ్ఞానిక రాజకీయాది విషయాల్లో

నాయకత్వానికీ, మనకూ మధ్యనున్న అంతరమెల్లా సమసి పోగలదు?

ఇంతటి ఘనకార్యం ఒక్కపూటలో కాగలదికాని, ఒక్కరివల్ల సాధింప తగ్గదిగాని కానిమాట వాస్తవం. దీని కంతటికీ రాష్ట్రనిర్మాణం అత్యంత ప్రయోజనకారి అన్న మాటకూడా నిశ్చయం. కాని అంతవరకూగాని, రాష్ట్రం సమీప భవిష్యత్తులో ఏర్పడని పక్షంలో అది తేలేవరకూ గాని, ఆగకుండా మన పారిశ్రామికోద్యమం నిర్నిరోధంగా సాగిపోవా లన్నమాట అన్నిటికన్న నిర్వివాదాంశం. పత్రికల ప్రచారంవల్లనేమి, నాయకుల ప్రబోధంవల్లనేమి, అభ్యుదయ సంస్థల నిర్మాణకార్యక్రమం వల్లనేమి, ఈ విషయంలో విప్లవాత్మకమైన ప్రయత్న మెంతైనా జరగవలసిన ఆవశ్యకత వుంది.

ఆంధ్రుల "సర్వతోముఖాభివృద్ధి" మాట యెట్లా వున్నా, ఇటువంటి ఒక్క విషయంలోనైనా, ఆంధ్రమహాసభ తగినంత కృషిచేస్తే, దాని ఉనికి కొంతవరకూ సమర్థనీయ మౌతుంది.

## (౧౩) చెన్నపురి - ఆంధ్రరాష్ట్రము

చారిత్రక నిదర్శనా లెన్నైనా చూపవచ్చు; భూగోళ శాస్త్రరీత్యా ఎన్ని కారణాలైనా చెప్పవచ్చు; జనాభా లెఖ్ఖ లిం తప్పు, లేకపోతే అక్కడ ముప్పాతిక భాగము ఆంధ్రులని వాదించవచ్చు; దాని అభివృద్ధికై చేసిన కృషిలో, దాని గౌరవప్రతిష్ఠలకై సల్పిన త్యాగములో మనమే అగ్రగణ్యులమని ఎలుగెత్తిచాటవచ్చు; కాని ఒక నగ్నసత్యాన్నిమాత్రం మన మందరమూ గుర్తించకతప్పదు. అది ఏమంటే,

అక్కడి ప్రస్తుత ఆంధ్రతమిళ శక్తుల తారతమ్యాలను పరిశీలిస్తే, మద్రాసు అరవపట్టణమని ఎటువంటి వారికైనా స్ఫురిస్తుంది!

స్టేషనులో దిగింది మొదలు ఎటుబోయినా అరవభాషే వినిపిస్తుంది; ఎటుచూచినా గూడకట్టే కనుపిస్తుంది; ఏ ప్రకటన బల్ల చూచినా అరవలిపే గోచరిస్తుంది; ఏ పూటకూటింటికి వెళ్ళినా అరవభోజనమే! ఏ సినీమాకు, ఏ గానసభకు పోయినా అరవచిత్రమే, అరవయాజమాన్యమే! పాఠశాలలు, గ్రంథాలయాలు, ఉపన్యాసమందిరాలు, కళాక్షేత్రాలు వారివి! ఉన్నత ప్రభుత్వోద్యోగులందరూ వారు! పేరెన్నికగన్న లాయర్లు, డాక్టర్లు వారు! వణిక్శిఖామణులు, పారిశ్రామిక నాయకులు వారు! ఇంత ఎందుకు? కొత్తగా చెన్న

పురి చూడవచ్చినవారికి, కూలీ మొదలు కుబేరుడివరకూ, దాదాపు అందరూ, అరవవారుగానే కనుపిస్తారు !

ఇక అది ఆంధ్రనగరమని మనమెంతడాంబిక ప్రచారం చేస్తేమటుకు ఎవరు నమ్ముతారు ?

నిజానికి చెన్నపట్టణంయొక్క ఆవశ్యకత అరవవారి కన్న మనకే ఎక్కువ వుంది. ఆధునికయుగంలో ఒక జాతియొక్క నాగరికత, అది నిర్మించిన పట్టణాలూ, వాటిలో వున్న దాని ప్రజానీకంయొక్క ఔన్నత్యమూ విశిష్టతలలో ప్రతిఫలిస్తూ వుంటుంది. అల్లా తమిళజాతీయ విశిష్టతని ప్రస్ఫుటం చేసే పెద్దనగరాలు, కొన్నిలక్షల జనాభాలు గలవి, కనీసం రెండుమూడైనా ఉన్నై. అందుచేత మద్రాసు వారి చేతినుండి జారిపోయినా వారంతగా విచారించవలసిన పని లేదు.

కాని మన అక్కరమాత్రం వేరు. పెద్ద పట్టణాల ప్రసక్తి వస్తే మనకు మద్రాసు తప్ప దిక్కులేదు. భవిష్యదాంధ్రరాజధానిగాఎంచుకోబడే బెజవాడకు భారతప్రధాన నగరశ్రేణిలో స్థానం లభించడం ఇప్పట్లో అసంభవం. కనుక, ప్రాదేశికంగా కేంద్రస్థానం ఆక్రమింపకపోయినా, ఆర్థిక రాజకీయ వైజ్ఞానిక పారిశ్రామికాది సమస్త వుద్యమాలకూ, కనీసం కొన్ని పుష్కరాలవరకైనా మద్రాసు మనకు ప్రధానాధారంగా వుండకతప్పదు. ఇంకా కొన్ని దశాబ్దులవరకూ

ఆంధ్రేతరులందరూ ఆంధ్రజాతియొక్క మీగడతరకలకై మద్రాసులోనే వెతుకుతూ వుండడం కూడ సహజమూ సమంజసమూను. కనుకనే మనకు మద్రాసు యొక్క ప్రాముఖ్యత !

అయినదానికీ, కానిదానికీ మనం అరవవారిని ద్వేషించి, దూషించి ప్రయోజనంలేదు. మనకు తెలివితేటలూ, కార్యదీక్షా వుండి, మనం ప్రయోజకులమై ఔన్నత్యం పొందుతామంటే వారెన్నడూ మనల నాపలేరు. స్వజాతీయాభివృద్ధికై ఎవరికి చేతనైనంత వారు యత్నించడంలో, ఇతరులని మోసగించి దురాక్రమణ చేయనంతవరకూ, తప్పేమీలేదు. అల్లా ఆంధ్ర తమిళ ప్రాంతాలకు దాదాపు సమానదూరంలో వున్న మద్రాసు నగరంలో ప్రాబల్యం సంపాదించడానికి అరవ తెలుగులకు దాదాపు సమానావకాశాలున్నై. అయినప్పటికీ అక్కడ వారికీ మనకూ గల పలుకుబళ్లలో ఇంతటి వ్యత్యాసం వున్నదంటే తప్పెవరిది ?

వారు సకలప్రయత్నాలూ చేసి, అష్టకష్టాలూ పడి అక్కడి ప్రభుత్వోద్యోగాలలో అత్యధిక భాగం తమ హస్తగత మయ్యేటట్టు చేసికొన్నారు. తమ పరిశ్రమల నన్నిటినీ చాలవరకు అక్కడనే స్థాపించి తమ ఆర్థికస్థితినీ పలుకుబడినీ సుస్థిరం చేసికొన్నారు. తమిళుడ నని చెప్పుకొనివచ్చిన ప్రతి

పురి చూడవచ్చినవారికి, కూలీ మొదలు కుబేరుడివరకూ, దాదాపు అందరూ, అరవవారుగానే కనుపిస్తారు !

ఇక అది ఆంధ్రనగరమని మనమెంతడాంబికప్రచారం చేస్తేమటుకు ఎవరు నమ్ముతారు ?

నిజానికి చెన్నపట్టణంయొక్క అవశ్యకత అరవవారి కన్న మనకే ఎక్కువ వుంది. ఆధునికయుగంలో ఒక జాతియొక్క నాగరికత, అది నిర్మించిన పట్టణాలూ, వాటిలో వున్న దాని ప్రజానీకంయొక్క ఔన్నత్యమూ విశిష్టతలలో ప్రతిఫలిస్తూ వుంటుంది. అల్లా తమిళజాతీయ విశిష్టతని ప్రస్ఫుటం చేసే పెద్దనగరాలు, కొన్నిలక్షల జనాభాలు గలవి, కనీసం రెండుమూడైనా ఉన్నై. అందుచేత మద్రాసు వారి చేతినుండి జారిపోయినా వారంతగా విచారించవలసిన పని లేదు.

కాని మన అక్కరమాత్రం వేరు. పెద్ద పట్టణాల ప్రసక్తి వస్తే మనకు మద్రాసు తప్ప దిక్కులేదు. భవిష్యదాంధ్రరాజధానిగాఎంచుకోబడే బెజవాడకు భారతప్రధాన నగరశ్రేణిలో స్థానం లభించడం ఇప్పట్లో అసంభవం. కనుక, ప్రాదేశికంగా కేంద్రస్థానం ఆక్రమింపకపోయినా, ఆర్థిక రాజకీయ వైజ్ఞానిక పారిశ్రామికాది సమస్తవుద్యమాలకూ, కనీసం కొన్ని పుష్కరాలవరకైనా మద్రాసు మనకు ప్రధానాధారంగా వుండకతప్పదు. ఇంకా కొన్ని దశాబ్దులవరకూ

ఆంధ్రేతరులందరూ ఆంధ్రజాతియొక్క మీగడతరకలకై మద్రాసులోనే వెతుకుతూ వుండడం కూడ సహజమూ సమంజసమూను. కనుకనే మనకు మద్రాసు యొక్క ప్రాముఖ్యత !

అయినదానికీ, కానిదానికీ మనం అరవవారిని ద్వేషించి, దూషించి ప్రయోజనంలేదు. మనకు తెలివితేటలూ, కార్యదీక్షా వుండి, మనం ప్రయోజకులమై ఔన్నత్యం పొందుతామంటే వారెన్నడూ మనల నాపలేరు. స్వజాతీయాభివృద్ధికై ఎవరికి చేతనైనంత వారు యత్నించడంలో, ఇతరులని మోసగించి దురాక్రమణ చేయనంత వరకూ, తప్పేమీ లేదు. అల్లా ఆంధ్ర తమిళ ప్రాంతాలకు దాదాపు సమానదూరంలో వున్న మద్రాసు నగరంలో ప్రాబల్యం సంపాదించడానికి అరవ తెలుగులకు దాదాపు సమానావకాశాలున్నై. అయినప్పటికీ అక్కడ వారికీ మనకూ గల పలుకుబళ్లలో ఇంతటి వ్యత్యాసం వున్నదంటే తప్పెవరిది ?

వారు సకలప్రయత్నాలూ చేసి, అష్టకష్టాలూ పడి అక్కడి ప్రభుత్వోద్యోగాలలో అత్యధికభాగం తమ హస్తగత మయ్యేటట్టు చేసికొన్నారు. తమ పరిశ్రమల నన్నిటినీ చాలవరకు అక్కడనే స్థాపించి తమ ఆర్థికస్థితినీ పలుకుబడినీ సుస్థిరం చేసికొన్నారు. తమిళుడ నని చెప్పుకొనివచ్చిన ప్రతి

వాని యందూ స్వజాత్యభిమానం చూపి, వానికి అక్కడ జీవనాధారం కల్పిస్తూ అక్కడి తమ సంఖ్యాబలం అభివృద్ధి చేసికొన్నారు. ఇవన్నీ మన తెలుగువారుకూడా చేస్తామంటే ఎవరు వద్దన్నారు ? ఎవరు వద్దనగలరు ?

కనుక ఇప్పటికైనా కార్యసాధనకు పూనుకొని చెన్నపురిలో మన పరపతి నభివృద్ధిపరచుకొనడానికి మనం చేయవలసిన దెంతైనా వుంది.

(౧) మొదట అక్కడి తెలుగువారందరూ తెలుగు భాషనే ప్రధానంగా వాడాలి. ట్రాముబండిలో, బజారులో, కచ్చేరీలో, క్లబ్బులో ఏమైనాసరే అరవవారిచేత తెలుగు మాట్లాడించాలిగాని, మనం అరవం మాట్లాడకూడదు. అక్కడి ఆంధ్రులందరూ ఈ దీక్షబూనితే మద్రాసులో మన పరపతి అమోఘంగా పెరిగిపోతుంది. ఇది అతి సులభమూ, ఆచరణీయమూ కూడాను.

(౨) మిగిలిన పరిశ్రమలవిషయ మెల్లావున్నా, మొదట ఉత్తమతరగతికి చెందిన కాఫీ భోజన విశ్రాంతి భవనాలు కనీసం సగం ఆంధ్రుల వయ్యేటట్టు చూడాలి. అక్కడిఆంధ్రులందరూ విధిగా వీటినే ఆదరించాలి.

(3) పై రెండు విషయాలూ క్రమంగా నిర్వహింపబడితే, కార్యార్థులై గ్రామాంతరాలనుండి అక్కడికి వచ్చే తెలుగువారందరికీ అనుకూలంగానూ ప్రోత్సాహకరంగానూ

వుంటుంది. దీనికి తోడు అక్కడి ఆంధ్రులందరూ, తమ యావచ్ఛక్తినీ వినియోగించి, తలా ఒక ఆంధ్రకుటుంబాన్ని జిల్లాలనుండి రప్పించి, దాని కక్కడ స్థిరనివాసం ఏర్పడే టట్టు జేయగలిగితే, మద్రాసులో మనసంఖ్యాబలం బ్రహ్మాండంగా పెరిగిపోతుంది.

(౪) ఇది సాధ్యపడడానికి అక్కడి ఆంధ్రపారిశ్రామికు లందరూ తమ సంస్థలలో ఆంధ్రులనే నియమించే దీక్ష బూనాలి. మన నూతన పరిశ్రమలను సాధ్యమైనంతవరకూ అక్కడనే స్థాపించాలి. ఆర్థికస్థితి అనుకూలించే, జిల్లాలలోని క్రొత్తప్లీడర్లూ, డాక్టర్లూ తమ వృత్తులని మద్రాసులోనే ప్రారంభించాలి. నూతనంగా ఏదైనా స్థిరాస్తి నేర్పరచుకో దలచుకొన్న శ్రీమంతులు దానిని వీలైనంతవరకూ అక్కడే సంపాదించే ప్రయత్నం చేయాలి.

వీటికి తోడు, మనం ఆందోళనచేసి, తెలుగు జిల్లాలలో ఏవూరినుండి అయినా చెన్నపురికి రైలుమీద చౌకధర టికెట్లు ఇవ్వబడేటట్టు చేయాలి.

(౫) కార్పొరేషనులో సభ్యులు కనీసం సగం మంది శుద్ధ ఆంధ్రులయ్యేటట్టు చూడాలి, దీనితో మ్యునిసిపల్ ఆంధ్ర ప్రాథమిక పాఠశాలలు లేని అనర్థకమే గాక, ఇతర అన్యాయాలుకూడ ఎన్నో చక్కబడగలవు. ఇల్లాగే సమస్త

ప్రభుత్వోద్యోగాలలో మనకు సగపాలు లభించేటట్టు ఆందోళన చెయ్యాలి.

(౬) కేవల మాంధ్రులవే అనదగిన విద్యాసంస్థలూ, వార్తాపత్రికలూ, కళామందిరాలు మొదలైన సర్వజన సంస్థలు, జిల్లాలలో ధనం యాచించి అయినా సరే, అక్కడ సగానికి సగము ఏర్పడేటట్టు చూడాలి.

ఈ ప్రణాళిక బహుక్లుప్తమూ, సూచనాప్రాయమూను. కాని మనం దూరదృష్టితో, కార్యదీక్షతో ఉపక్రమించవలెనే గాని, ఇంతకన్న విరళమూ, నిర్దుష్టమూ అయిన వాటి నెన్నిటినైనా సృష్టించవచ్చు.

వీటి నిర్మాణంగాని ఆచరణగాని ఆంధ్రమహాసభ యొక్క కార్యకలాపంలో ఒక ముఖ్యాంశమై యుండవలెననే మాట నిస్సంశయం. వీటివల్లనైనా దానియొక్క వ్యక్తిత్వమూ, మనోస్వాతంత్ర్యమూ కొంతవరకు ప్రకటింపబడగలవు.

# (౧౪) శాసనసభా కార్యక్రమము: ఆంధ్ర రాష్ట్రము.

ఆంధ్రమహాసభ శాసనసభల ఎన్నికలలో ఎందుకు పోటీ చేయకూడదు?

(౧) ఇది ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై ఏర్పడినదే కాని, ఒక రాజకీయ కక్షగా తయారు కాదగిన సంస్థకాదన్నది మొదటి అభ్యంతరం

కావచ్చు. కాని ఆ రాజకీయాభివృద్ధి కూడా "సర్వతోముఖాభివృద్ధి"లో ఒక భాగమై ఇమిడివుంది. అంతేకాదు: ఈ రోజులలో రాజకీయశక్తి నవగ్రహాలలో సూర్యుని వంటిది. ఈ ఉత్తమాంగాన్ని ఆధారంచేసికొనే జాతి యొక్క మిగిలిన అవయవాలన్నీ అభివృద్ధి పొందుతూవుంటవని చెప్పవచ్చు. ఒక దృక్కోణాన్ననుసరించి దేశంలో పారిశ్రామిక, ఆర్థిక, ఔన్నత్యం కలిగించవలెనన్నా, విద్యాభివృద్ధికీ కళావికాసానికీ తోడ్పడవలెనన్నా, నిర్బంధ సైనిక శిక్షణ, యుద్ధశాస్త్ర సాంకేతికవిద్య మొదలైన వాటితో జాతీయ రక్షణశక్తి నభివృద్ధిచేయవలెనన్నా, శాసన సభలో మనకున్న బలమక్కరకు వచ్చినట్లు ఇంకొకటి ఉపయోగపడదు.

(౨) ఆంధ్రమహాసభ ఏ ఒక్క పక్షానికీ చెందిన సంస్థకాదు గనుక దీనిలో అన్ని పక్షాలవారూ చేరగల్గుతున్నారు. కాని దీనికొక పాక్షిక నియమావళి నేర్పరచి, దీనిచుట్టూ ఉన్నత ప్రాకారాలను నిర్మించామంటే, దీనికి యావదాంధ్రులకూ ప్రాతినిధ్యం వహించే అవకాశం ఉండదు. అందువల్ల రాష్ట్రవాంఛలో ఇపుడు మనకున్న ఐక్యత నశించి మన శక్తి క్షీణించగలదన్నది రెండవ అభ్యంతరం.

కాని ఆంధ్రాభ్యుదయం అభిలషించే ప్రతి రాజకీయ కక్షా దీనిలో స్థానం పొందగలిగేటట్లు ఆంధ్రమహాసభ యొక్క నియమావళి నేర్పరుపవచ్చు. ఉదాహరణకి, "కేవల రాష్ట్రీయ సమస్యల్లో మాత్రమే ఆంధ్రమహాసభ అభిప్రాయాలను మన్నించవలెనన్న నిర్బంధము: మిగిలిన అన్ని సందర్భాలలో ఇందులో చేరే ప్రతి రాజకీయ పక్షమూ తమతమ మాతృ సంస్థల ఆజ్ఞలను పాలించవచ్చు" నన్న సూత్రం వివిధ మతాలవారికీ స్వాగతమీయవచ్చు. ఒకవేళ ఇది కొందరిని బెదురుపెట్టి, వారు "ఏవిషయంలోగాని మా ప్రవర్తన మా మాతృ సంస్థల ఆజ్ఞానుబద్ధమై ఉండవలసిందే" అనే పక్షంలో, వారిలో తప్పేమీ వుండకపోవచ్చుగాని, వారు మాత్రం మనకు నిరుపయోగులు! వారివల్ల మన రాష్ట్రీయాశయాలు ఖచ్చితంగా నెరవేరగలవని మన మాశించలేము.

౧౯౩౭ నాటి కాంగ్రెసు ప్రభుత్వంలో ఇదే తటస్థించింది. మద్రాసు శాసనసభలో ఉన్న ఆంధ్ర కాంగ్రెసు సభ్యులందరూ ఆంధ్రాభిమానులే. కాని వారికి కాంగ్రెసు కులదేవత. అందువల్ల ఆంధ్రరాష్ట్రం విషయంలో గట్టి పట్టు పట్టలేక పోయారు. కాని వారే ఆంధ్రమహాసభ ప్రతినిధులై వుండి నట్లైతే కథ ఇంకొకవిధంగా నడిచివుండేది.

(3) రాష్ట్రాభ్యుదయ మార్గాలని వివిధ కోణాల నుండి సూచించడానికి మన రాష్ట్రంలోనే అనేక రాజకీయ పక్షా లుంటూవుంటే, ఇక ఆంధ్రమహాసభ పేరిట ఇంకొకటి కొత్తగా ఎందుకని మూడవ అభ్యంతరం.

కాని, హిందూ మహాసభ, ముస్లిం లీగూ, నిమ్న జాతి పక్షమూ, ఇత్యాది సంస్థలన్నీ దేశంలో వర్ధిల్లుతున్నప్పటికీ, అన్ని మతాల అభివృద్ధికీ కృషిచేయ సంకల్పించే కాంగ్రెసు తన ఉనికిని ఉపసంహరించుకొన్నదా? సకల మత శ్రేయోభిలాషిత్వమే దాని విశిష్టత. విశిష్టత గల ప్రతి సంస్థకీ ప్రత్యేక జీవనార్హత వుంది. అదే విధంగా ఆంధ్రమహాసభకి కూడాను!

ఇంతేకాక ఏ జాతీయాశయ సాఫల్యానికైనా ప్రస్తుత కాలంలో రెండే రాజమార్గాలు కన్పిస్తున్నై; సాయుధంగా గాని శాంతయుతంగా గాని ప్రత్యక్ష సమరం చేయడము; లేక శాసనసభా మందిరంలో తగిన సంఖ్యాబలం సంపాదించి ప్రభుత్వాన్ని హస్తగతం చేసికొనడమూ. కాంగ్రెసు

ఆదిలో ఈ రెండవ మార్గాన్ని తృణీకరించినా, కాలక్రమేణా దీని ప్రయోజనాన్ని గుర్తించి, ఇప్పుడు తన జగన్నాథ రథాన్ని అద్వితీయ ప్రతిభతో ఇటుకూడా నడిపిస్తోంది. ఇక లీగు, హిందూమహాసభ మొదలైన ఇతర సంస్థలు మొదటి మార్గ ప్రసంగాన్ని కలలోకూడ స్మరించక, రెండవదాన్నే అనుసరిస్తున్నై. ఇందరి ఘనులకు ఆమోదకరమైన పద్ధతి మనకెల్లా ఆక్షేపణీయ మౌతుంది?

అసలు శాసనసభలను గురించి ఈ వైరాగ్యం మనకెల్లా కలిగింది? మూడుకోట్ల ప్రజానీకానికి రాజకీయంగా కూడా ఒక అర్హస్థానం సంపాదింపదలచే ఆంధ్రమహాసభకు ఇంత ప్రముఖ విషయంలో ఇంత విముఖత్వం కలగడమెల్లా తటస్థించింది?

ఇది ఆంధ్ర ప్రజాసామాన్యంయొక్క అమాయకత్వానికి ఒక ప్రబల తార్కాణం! ఆంధ్రత్వాన్ని కాంగ్రెసుతో తాదాత్మ్యం పొందించి, కాంగ్రెసు విజయమే మన కిహపర సాధనమని విశ్వసించుటయొక్క ఫలితం!

"కాంగ్రెసు శాసనసభలను ప్రవేశిస్తే, ఇక మనం ప్రవేశించవలసిన అవసరమేముంది? లేక కాంగ్రెసు వాటిని వదలివేస్తే, మనం వెళ్ళి మటుకు ప్రయోజనమేముంది?" అనే వితండ వాదానికి మనం పూర్తిగా వశవర్తుల మయ్యాము!

కాని ఎంతమాత్రం స్వతంత్రాలోచనాపరులమైనా దీని మర్మాన్ని ఇదివరకెప్పుడో గ్రహించి వుండేవాళ్లము. శాసనసభా ప్రవేశం ఆంధ్రమహాసభలో అపూర్వ ఉత్సాహ ప్రభు మంత్రశక్తులని ఉద్భవిల్ల జేస్తుంది. అక్కడ దానికున్న సంఖ్యాబలం ప్రజా సామాన్యంలో దాని సిద్ధాంతాలమీద వున్న అభిమానాన్ని ప్రతిబింబింప జేస్తుంది. మహాసభ పేరిట అక్కడ ఒక రాజకీయ కక్ష వుంటే, అది ఆంధ్రోద్యమాని కంతటికీ ఒక ప్రత్యేక గౌరవమూ, వ్యక్తిత్వమూ తెచ్చి పెడుతుంది.

కనుక ఆంధ్రమహాసభకు శాసనసభా ప్రవేశవిష యంలో రెండు అభిప్రాయా లుండవలసిన అవసరం కను పించదు.

కాని బొత్తుగా అంగబలమూ అర్థబలమూ లేని ప్రస్తుత అశక్తస్థితిలో మహాసభ బలవంతులైన ఇతరులతో తలపడి ప్రతి ఎన్నికలలోనూ పోటీచేయడం కేవలం మూర్ఖ సాహసమౌతుంది.

కాని శాసనసభలు అనే ఈ ఆధునిక ఆయుధాన్ని ఏవిధంగానూ మనస్వప్రయోజనానికై వినియోగించుకోలేక సోమరులమై కూర్చుండడంకూడా అసహనీయం.

కనుక మహాసభకు తగిన బలం ఏర్పడేవరకూ చేయ దగిన దేమిటి?

ఆంధ్రమహాసభకున్న శక్తి అత్యంత పరిమితమైనా, దాని నంతటినీ ఏ కొద్ది స్థానాలలోనో తీక్షణంగా కేంద్రీకరించి, అక్కడనే దాని అభ్యర్థులను గెలిపింప సాధ్యమౌతుందా?

లేక మన ఆశయ సిద్ధికి తోడ్పడగల, దేశానికి అనర్థ దాయకముగాని, ఏ ఇతర పక్షాలతోనైనా సహకారంచేసి, వాటిని గెల్పించి, వాటిద్వారా స్వప్రయోజనాన్ని సాధింపవీలౌతుందా? అయితే అటువంటి పక్షాలు ఏవి? వాటితో ఏ షరతులమీద ఎంతవరకూ సహకారం చేయవచ్చు? చేయగలం?

లేక వివిధ పక్షాలనుండి అభ్యర్థులు గెలుపొందిన మీదట, (అందరూ ఆంధ్రాభిమానులే కనుక), "ఆంధ్ర రాష్ట్ర సమస్య సందర్భంలో ఆంధ్రమహాసభ అభిప్రాయాన్ని ఆదరిస్తాము." అన్న ప్రమాణాన్ని వారివద్దనుండి పొందవచ్చునా?

లేక ఇంకేమి చేయవచ్చును? తరచూ ఆవర్తమవుతూవుండే ఈ ఎన్నికలను ఆంధ్రరాష్ట్రాభివృద్ధికి అత్యుత్తమవిధంగా మనం ఉపయోగించుకోగల మార్గమేది?

పై సూచనల కన్నిటికీ అనేక ఆక్షేపణ లుండవచ్చు. కాని ఈ విషయాన్ని సమగ్రంగా చర్చించి ఒక ఆదర్శప్రాయమైన నిర్ణయానికి రావడం ఆంధ్రమహాసభయొక్క అతి ముఖ్యమైన విధి అనడంలోమాత్రం సందేహముండదు.



## (౧౫) స్వతంత్రభారతము - ఆంధ్రరాష్ట్రము

రాష్ట్రనిర్మాణం మనకు రాజకీయ హోదా నేర్పరుస్తుంది కాని మానసిక స్వాతంత్ర్యాన్ని సంపాదింపదు. మనకు ప్రత్యేక గవర్నర్లు రావచ్చు; ప్రత్యేక శాసనసభలు తయారు కావచ్చు; ప్రత్యేక న్యాయస్థానాలు అవతరించవచ్చు; ప్రత్యేక రాజధానీనగరమూ, ప్రత్యేక ప్రధాన కార్యాలయాలూ నిర్మింపబడవచ్చు; అంతా నవీనత ప్రత్యేకత లాగ గోచరించవచ్చు. కాని మన స్వభావంలో ప్రత్యేకత లేనపుడు, ఇవన్నీ మనఇల్లు గుల్లచేసేందుకే కాని మన నుద్ధరించేందు కుపయోగపడవు.

ఆంధ్రవిశ్వవిద్యాలయం ఇందు కొక నిదర్శనం. ఇది మన ప్రత్యేక విద్యాసంస్థ. దీని నిర్మాణం జరిగి రెండు పుష్కరాలు కావస్తోంది. దీనిమీద ఇంతవరకూ ఎన్నోలక్షలు వెచ్చించాము. కాని ఇది ఏవిధంగా ఆంధ్రుల గౌరవాతిశయాలను విస్తరింపజేసి, ఆంధ్రసంస్కృతియొక్క విశిష్టతని స్పష్టపరుపగలిగింది? ఏవిధంగా ఇది అఖిలభారత విశ్వవిద్యాలయశ్రేణిలో అగ్రస్థానానికై కృషిచేస్తోంది? కాశీవిశ్వవిద్యాలయానికి గల యావద్హిందూమండలాన్ని ఆకర్షించే శక్తి దీని కెందు కుండకూడదు? ఉస్మానియా యూనివర్సిటీ వలె దేశభాషలో బోధించేఖ్యాతి దీని కెందుకు రాకూడదు?

ఏదో ఒక్క విషయంలోనైనా ఇతర విశ్వవిద్యాలయాలకు మార్గదర్శకం కాగలస్థితికి మన మెందుకు నోచుకోకూడదు? ఇక ఏమీ లేనపుడు, ఎంతసేపటికీ మద్రాసుయొక్క ఛాయా చిత్రంగా వుండడమే మన ఆదర్శమైనపుడు, మనం మద్రాసు నుంచీ వేరుపడడ మెందుకు?

ఎవరి కరుణావిశేషంవల్లనో మన కొక రాష్ట్ర మంటూ నిర్మింపబడినప్పటికీ, దానిస్థితి ఇంతకంటె భిన్నంగా వుండబోదు. మనరాష్ట్రంయొక్క ప్రత్యేక అవసరాల ననుసరించి, మన అభివృద్ధికి అత్యుత్తమ పద్ధతిని తోడ్పడగల ఒక స్వతంత్రప్రధాన్ని ఏర్పరచుకొనేశక్తి ఎక్కువగా రాష్ట్రనిర్మాణంలో వుండదు; మన స్వభావంలో వుంటుంది. కాని సర్వకాల సర్వావస్థల యందూ ఆజ్ఞలకై ఉత్తరదిక్కుగా చూస్తూవుండే పవిత్ర మనస్తత్వం మనది! ఇక స్వతంత్ర భారతావనిలో ప్రత్యేకిత ఆంధ్రరాష్ట్రంయొక్క స్థితి యెల్లా వుంటుందో చెప్పడ మెందుకు?

ఒక బిర్లా మనకు మోటారుకార్లు అమ్ముతాడు; ఒక తాతా మనకు విమానాలు నడుపుతాడు; ఒక హీరాచందు మన నౌకానిర్మాణం గుత్తకు తీసికొంటాడు! ఒక గుజరాతీ మన గుడ్డలు, ఒక బెంగాలీ మన సబ్బులు, ఒక మరాటీ మన మందులు, ఒక మార్వారీ మన పెట్టుబడులు మనకు అందిస్తారు. మన కొక గాంధీ అహింసా సిద్ధాంతం ప్రబోధిస్తాడు; ఒక బోసు హింసాకాండలో శిక్షణ గరపు

తాడు, మన హిందువులకు సవర్కారుల దర్శకత్వము; మన ముస్లిములకు జిన్నాల నియంతృత్వము !

దీనికితోడు, ఏ కాంగ్రెసుమీది పరిపూర్ణ భక్తి విశ్వాసాలచేత, ఆత్మప్రయోజనాన్ని విస్మరించి 33 ఏండ్లు ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించుకోలేకపోయామో, ఆ కాంగ్రెసు మీది భక్తివిశ్వాసాలచేతనే, రాష్ట్రనిర్మాణానంతరంకూడ, రాష్ట్రీయశ్రేయోనర్థకాలను పరిగణించక, అఖిలభారత దృక్పథంతో, మనం ఆంధ్రాభ్యుదయాన్ని పరరాష్ట్రీయుల పాదతలం వద్ద బలి ఇస్తాము. నిశ్చయం.

ఆంధ్రరాష్ట్రనిర్మాణం జరిగిననాడు దాని మంత్రివర్గం కాంగ్రెసు చేతిబొంగరమై యుంటుందని మనం సామాన్యంగా విశ్వసించవచ్చు. కాని ఒకప్పుడు రాష్ట్రనిర్మాణావశ్యకతను గురించి సర్. విజయాతో వెళ్ళి పార్లమెంటరీ రాయబార వర్గానికి నచ్చజెప్పడం కాంగ్రెసు క్రమశిక్షణకి భంగకరమని ఆంధ్రశాసనసభ్యులు తలచినపుడు, ఇంకొకప్పుడు ప్రత్యేకిత ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గం మాత్రం ఇంతకంటె ఏమి ఎక్కువ సాహసించగలదు? సరిహద్దునిర్ణాయక సంఘం గంజాం జిల్లా, మద్రాసునగరమూ మొదలైనవాటిలో మన కన్యాయంజేసినా మనం నోరెత్తకూడదు! పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన ఔత్తరాహులు మనని కొల్లగొట్టుకు పోతున్నా మనం కిక్కురుమనకూడదు! బందరు రేవుగాని,

రాయలసీమగాని, యావదాంధ్రంగాని నిజాముప్రభువు కివ్వ బడుతుందన్నా మనం నిరోధించకూడదు! ఏమంటే, అది కాంగ్రెసు క్రమశిక్షణ! దానికిమించిన పరమార్థ మేముంది మనకు ప్రపంచంలో?

ఇల్లా గుండుసూదులమొదలు సిరంగిగుండ్లవరకు, రాజకీయాలమొదలు మత రహస్యాలవరకు, పిపీలికాదిబ్రహ్మ పర్యంతమూ గల సమస్త వస్తుసముదాయమూ పరరాష్ట్రీయులచేత ప్రసాదింపబడుతుంది. మనది వట్టి ముడిసరకు రాష్ట్రమై, ఆర్థికంగా, పారిశ్రామికంగా, వైజ్ఞానికంగా, సమస్తంగా మనం పరాధీనతలో ప్రథమతాంబూలం పుచ్చుకొంటాము. స్వతంత్ర భారతావనిలో మనదొక రెండవరకపు రాష్ట్రమై, అన్నివిషయాలలో ఇతరులకు వలసభూమిగా తయారౌతుంది!

దీనిని బట్టి ఆంధ్రరాష్ట్రనిర్మాణం అనవసరం అని కాదు: లేక ఆంధ్రరాష్ట్రనిర్మాణంవల్లనే ఈ అనర్థకాలన్నీ కలుగతవని అంతకంటె కాదు! కాని రాష్ట్రనిర్మాణం మాత్రం సరిపోదు. మన మనస్తత్వంలో తగినంత మార్పు రావాలి. అంతవరకూ ప్రత్యేకిత ఆంధ్రరాష్ట్రం కూడా మనకు పరిపూర్ణ ప్రయోజనకారి కాలేదు. కాని ఆ మనోవైఖరియొక్క పరివర్తనానికై మనం రాష్ట్రనిర్మాణం వరకూ కనిపెట్టుకొని వుండనక్కరలేదు.

ఉదాహరణకి, రాష్ట్రం వచ్చినా రాకపోయినా, ఇతర విశ్వకళాపరిషత్తులలో లేని ఏదో ఒక ప్రత్యేక సదుపాయం కల్పించి ఆంధ్రవిశ్వవిద్యాలయం యావద్భారతావనినుంచీ విద్యార్థుల నాకర్షించి, ఆదాయం, ప్రతిష్టా ఎందుకు అభివృద్ధి చేసికోకూడదు? మన వాహినీవారి చిత్రాలు హిందూదేశంలో ఏ ఉత్తమ తరగతి చిత్రాలకూ తీసిపోని వని ప్రఖ్యాతి వహించినవి. వీరు హిందీచిత్రాలు తీసి ఇంతకు నూరురెట్లు ధనం ఎందుకు ఆర్జించకూడదు? మనకు తెలుగు పత్రిక లెన్ని వున్నా మన ఆర్థిక సంపద ఒక చిల్లి గవ్వ పెరగదు; మనం ఆంగ్లపత్రికల నెన్నిటినో ఇంతరకూ ఎందుకు స్థాపించి వుండకూడదు? దానివల్ల పరభూములకు మన ప్రతిభ కొంత వ్యాపించియుండేదే? లేక కనీసం అన్యరాష్ట్రీయులు ఆంగ్లపత్రికల రూపంగా మనలను దోచుకొనడమైనా కొంతవరకూ అరికట్టబడి వుండేదే! మనం వేరుశెనగ పొట్టు ఒలిచి ఇతరుల కెగుమతిచేసే బదులు, ఒకటి రెండు దుంపనెయ్యి యంత్రాలయాలు నిర్మించుకొని వున్నట్లైతే, జీవనదులవలె స్వర్ణస్రవంతులు మన తెలుగు సీమలోకి ప్రవహిస్తూ వుండేవే!

ఇటువంటి నిదర్శనా లెన్నైనా చూపించవచ్చు. ప్రతి విషయంలోనూ ఇతరులు మనపైన దూకుతున్నారు. ప్రజ్ఞలో వారు మనకన్న ఏవిధంగానూ ఎక్కువవారు కారు. ప్రతి విషయంలోనూ ఇతరులపై దుమికే ఆ పరాక్రమణ

స్వభావమే వారి నింత ఘనులుగా కన్పింప జేస్తోంది. పరాక్రమణ ఆత్మరక్షణకి ఉత్తమసాధన మన్నది నేటి వ్యాపార నీతి!

ఈ రహస్యాన్ని గుర్తించి, దీనికి అనుగుణ్యంగా మన ప్రకృతిని విప్లవింపజేస్తే తప్ప మన ఆంధ్రులకి మోక్షం లేదు. ఒక్క ఆర్థికంగానే కాకుండా, వైజ్ఞానికంగా, సాంఘికంగా, రాజకీయంగా ఏ వుద్యమంలోనూ, ఏ చిన్నవిషయంలో కూడా "ఆంధ్రు డింకొకరినుండి ఆజ్ఞలను స్వీకరించడు. అతడు స్వతంత్రాలోచనాపరుడు!" అన్న దృష్టితో మనం పని ప్రారంభించాలి. ఇంకొకరి నాయకత్వానికి తను లోబడే బదులు, వారిని అధిగమించి వారిపై తన నాయకత్వాన్ని స్థాపింపజేయగల మనోవైఖరికై ఆంధ్రుడు కృషి చేయాలి!

ఆంధ్రప్రకృతిలో యీ మార్పు లేని రాష్ట్రనిర్మాణం దాదాపు నిరుపయోగం. కాని యీ మార్పుని సాధించడానికి రాష్ట్రనిర్మాణం వరకూ వేచియుండడము అనవసరం. ఇది ముఖ్యంగా ఆంధ్రమహాసభా ప్రచారకశాఖ యొక్క విధి. దీనిని సక్రమంగా నిర్వర్తించడములో ఆంధ్రదేశానికి చేసినంత మేలు అది ఇంకొక విధంగా చేయలేదు.

———

## (౧౭) ఆంధ్రమహాసభ సంస్కరణ (౧)

పూర్వోక్త సందర్భాల నన్నిటినీ మనస్సులో వుంచుకొని ఇపుడు భవితవ్యాన్ని గురించి నాకు తోచిన యోచనలను సంగ్రహంగా క్రోడీకరిస్తాను.

భారత స్వాతంత్ర్యం, సమగ్రాంధ్ర నిర్మాణం మొదలైన వెల్లావున్నా, బ్రిటిషు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం మాత్రం అసాధ్య సమస్యలతో కూడుకొన్న విషయం కాదు. ఇది పరిపాలనా సౌకర్యార్థం ఒక పెద్దజిల్లాను రెండు చిన్నవాటినిగ భాగించడం వంటిది. ఇటువంటి స్వల్పక్రియా సాఫల్యం కొరకు మనం 33 ఏండ్లు కృతకృత్యులం కాలేకపోయినామంటే, మనని మనం తీవ్రమైన ఆత్మవిమర్శన చేసికోవలసిన అవసరమైనా వున్నదనక తప్పదు. మన వుద్యమానికి మనం వేసికొన్న పునాదిలో, మన సమస్యయొక్క పూర్వాపరాలను మనం అర్థంచేసికొన్న విధంలో, మనం మన ఆశయ సాఫల్యం కొరకు చేసే యావత్ప్రయత్నంలో ఏదో ఒక సుదీర్ఘమైన లోపం వుండితీరాలి! దానిని సవరించవలెనంటే, ఈ నాటకాని కంతటికీ సూత్రధారిత్వంవహిస్తున్న ఆంధ్రమహాసభని సంస్కరించడం సహజంగా అవసరమై వుంటుంది.

మనవుద్యమం తన ప్రత్యేకపరిస్థితులకీ, వాతావరణానికీ అనుకూలమైన, అవసరమైన మార్గంలో యథేచ్ఛగా నడవా

లంటే దానిని నిర్వహిస్తున్న ఆంధ్రమహాసభ తన వ్యక్తిత్వాన్ని సార్థకపరచే ఒక స్వతంత్ర అంగనిర్మాణ నియమావళిని (Constitution) ఏర్పరచుకోవాలి. కాని దానికి భిన్నంగా, తన ఆదర్శాలలో, దృక్పథంలో, కార్యక్రమ విధానంలో మహాసభ కాంగ్రెసుయొక్క అనుబంధసంస్థ అని తప్పక స్ఫురింపజేస్తుంది. అది ఏ ప్రణాళిక తయారుచేసినా కాంగ్రెసుపద్ధతులతో సారూప్యం కలిగివుండాలి! ఏ అడుగు వేసినా అది కాంగ్రెసుగీచిన గిరిలోనే పడాలి! చివరకు కాంగ్రెసు వినియోగంకొరకు ఆత్మప్రయోజనాన్ని త్యాగం చెయ్యడానికి కూడా సిద్ధపడి వుండాలి!

ఈదృక్పథంతో మనకు ఇప్పట్లో స్వరాష్ట్రంవచ్చినా అది కాంగ్రెసు వలసరాజ్యంలాగ వుంటుందికాని, ఇతర రాష్ట్రాలతో తుల్యమైన హోదాగల స్వతంత్రాంధ్రరాష్ట్రంలాగ వుండదు.

అల్లా కాకుండా వుండవలెనంటే, మహాసభలో ఏమి సంస్కరణలు జరగాలి?

(౧) ఆంధ్రమహాసభ నియమావళిలో అహింసా పద్ధతులనే అవలంబించవలెనన్న విధి వుండకూడదు.

ఈమార్పు మనలో అత్యధికసంఖ్యాకులకు అతి విప్లవకరంగా కనుపించవచ్చు. కాని నిజానికి అటువంటి దేమీ లేదు. 'అహింస' అన్న పదం లోపింప జేసినంతమాత్రాన

అహింసాపద్ధతుల నవలంబింపకూడదని కాని, దౌర్జన్యపద్ధతులవలంబించి ప్రభుత్వంమీద కత్తికట్టవలెనని కాని ఎక్కడున్నది? ముస్లింలీగు హింసాహింసల రెంటి ప్రసక్తి లేకుండనే ఒక మహాశక్తిసంపన్నమైన సంస్థలాగ తయారైంది; హిందూ మహాసభ అవసరమైతే భౌతికశక్తి నుపయోగించుతానని బెదిరించుతూ కుండ ప్రభుత్వంతో సంఘర్షణ పెట్టుకోలేదు.

దీనికితోడు, అహింసఅంటే, ప్రత్యేకంగా ఈరోజుల్లో మనలో ఎంతమందికి నిజమైన విశ్వాసం వుంది ?

ఈ పరిస్థితుల్లో మనం అహింసాసూత్రంయొక్క అసలైన ప్రయోజనం పొందకపోగా, కాంగ్రెసు ప్రభావ ప్రవాహంలో తొలిస్నానం చేస్తున్నాం! అందుచేత అహింసా పద్ధతులని విధిగా నిర్ణయించి మన మానసిక స్వేచ్ఛా సంచారానికి ఒక నిరర్థక చక్రబంధం కల్పించుకోనడం కంటె, ఆంధ్రమహాసభ నియమావళిలో నుంచి ఆ విధిని తొలగిస్తే బాగుంటుంది.

(౨) అహింసాప్రమాణానికి బదులు, "నేను మొదట ఆంధ్రుడను, తరువాత భారతీయుడను" అన్న ప్రమాణం మహాసభలో చేరే ప్రతిసభ్యుడూ తీసికొంటే మంచిది.

మహాసభ సామాన్యమానవుల ప్రయోజనార్థం, వారి ప్రకృతులకు అనుగుణమైన పద్ధతులలో నడుపబడే సంస్థానాని, ఒక ఋషిపుంగవుల దివ్యమండలి కాదు. సాధారణ వ్యక్తుల సహజానురాగం, మొదట తన కుటుంబమూ, తరు

వాత తన గ్రామమూ, తన రాష్ట్రమూ, తన దేశమూ, చివరకు యావత్ప్రపంచమూ— ఈక్రమంలో ప్రసరిస్తుందికాని, జగత్కళ్యాణమూ, జాతీయైశ్వర్యము, ప్రాంతీయసౌభాగ్యము ఆత్మచైతన్యము— ఈ వరుస వారికి అసహజమూ, అగమ్యగోచరమూ అవుతుంది. ఇది వారికి ఏటి కెదురీత వంటిది.

అదీగాక మహాసభ ఏర్పడింది కేవలమాంధ్రోద్ధరణకే గాని, కాంగ్రెసును బలపరచేందుకు కాదుగదా! కాంగ్రెసు యందు పరిపూర్ణమైన సానుభూతి వుంటేవుండవచ్చు. అఖిల భారత సమస్యా పరిష్కారానికై అదిచేసే మహాయజ్ఞంలో సాధ్యమైనంత సహకారం చూపవచ్చు. కాని అంతవరకే. ఆ సహకారంలో, ఆ సానుభూతిలో, తన జీవిత పరమావధి అయిన ఆంధ్రత్వాన్ని విస్మరించాలని ఎక్కడాలేదు. కనుక ఆంధ్రుల కందరకూ అతి సహజమైన ఈ ఆంధ్రత్వ ప్రమాణాన్ని స్వీకరించడం మహాసభ సభ్యులకి విధాయకమని నిర్ణయిస్తే, ఆంధ్రమహాసభ తన వునికియొక్క ప్రత్యేక అవసరాన్ని సార్థకపరుస్తుంది. ఆంధ్ర మహాజనులకు నూతనోత్సాహం కలిగిస్తుంది.

(3) వీటన్నిటికీ తోడు నియమావళిలో లిఖిత పూర్వకమైన మార్పేమీ జరగకపోయినా, ఇంకొక్క విషయంలో మాత్రం గట్టి సాంప్రదాయమైనా ఏర్పడాలి.

వ్యక్తులు యంత్రాలుకారు. వివిధ వ్యక్తులు అధ్యక్షులు కావడంతో వారివారి ఉత్సాహ శక్తి యుక్తుల

ననుసరించి మహాసభ కార్యక్రమం మందంగానో, తేజోవంతంగానో ఆటూ పోటులతో నడుస్తూవుంటుంది. అదీగాక సామాన్య పరిస్థితులలో ఏఒక్క వ్యక్తికీ గవర్నరుని కూడా చలింపజేయగలిగినంత అత్యధికమైన పరపతీ పలుకుబడీ ఏర్పడవు. ఈ రహస్యాన్ని గ్రహించే, అవనికాంతర్విభేదా లెన్నివున్నా, పైకిమాత్రం గాంధీ, జిన్నా, సవర్కార్ ప్రభృతులకు వారివారి సంస్థలు దాదాపు యావజ్జీవనియంతృత్వాధికారం ఇచ్చివేసినై. మనం మాత్రం ఆ పద్ధతి నెందుకు అనుసరించకూడదు ?

ఆ నాయకుడియొక్క జీవితాశయం ఆంధ్రోద్ధరణమే అయివుండాలి. అతడు ఆంధ్రేతరమైన ఏ రాజకీయ సంస్థయొక్క పరమభక్తుడై యుండకూడదు. కాని అంతమాత్రాన భారత జాతీయత వినాశమైనా ఆంధ్రత్వమే నిలవాలనే అతివాది కూడా కాకూడదు. ఆంధ్రత్వ భారతీయత్వాలకి వుభయతారక అనుసంధానం సమకూర్చే ఒక సమ్యగ్దృష్టీ, మరి ఇతర ఉత్తమ నాయకలక్షణాలూ అతనిలో వుండాలి. అటువంటి ఒక ధీరుణ్ణి మనం సాధ్యమైనంత జాగ్రత్తగా కాచి వడపోసి, సంతృప్తిపడిన మీదట మన నాయకుణ్ణిగా ఎన్నుకోవాలి, అతని వెనుక అందరమూ ఒక్కమాటగా నడవాలి.

ఈ పద్ధతి ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు విరుద్ధంగా వున్నదని మనలో కొందరికి భయం కలుగవచ్చు. కాని సద

సత్సంశయగోచర చైతన్యం గల మన వుద్యమాన్ని ఉత్తేజితం చేయడానికి అత్యావసరమైన ఒక క్రమశిక్షణ యీ పద్ధతివల్ల మన కబ్బుతుం దనడంలో ఎక్కువ అర్థముంది.

త్రిగుణాత్మకమైన యీ సంస్కారణలని ఆంధ్రమహాసభలో మనస్ఫూర్తిగా మనం ప్రవేశపెట్టగల్గిన నాటినుండి మన ఆంధ్రోద్యమం నూత్న చైతన్యంతో అప్రతిహతంగా సాగిపోతుందనడానికి ఏ సంశయమూ వుండదు.



## (౧౭) ఆంధ్రమహాసభ సంస్కరణ (౨)

ఆంధ్రమహాసభ అహింసా దీక్షా నిర్బంధం వదిలితే భావదాస్య విమోచనమూ, ఆంధ్రత్వానికి ప్రథమస్థానం ఇస్తే తన వృద్ధ్యభివృద్ధికై అప్రతిహతమైన చిత్తైకాగ్రతా, ఏకైక ఉత్తమ నాయక నియంతృత్వం కలిగిస్తే తన సర్వ శక్తులయొక్క అమోఘ కేంద్రీకరణమూ సంపాదించు కొంటుంది. కాని కేవలం ఈ నియమత్రయం మాత్రమే మనకు సర్వ కామ్యార్థసిద్ధినీ ఒనగూర్చదు. దీనిని సూత్ర ప్రాయమైన ఆదర్శంగా అంగీకరించి, ఆంధ్రమహాసభయొక్క భౌతిక అంగనిర్మాణంకూడా సౌష్ఠవంగా, సుస్థిరంగా అభి వృద్ధి పొందేటట్టు మనం చూడాలి.

(౧) సంవత్సరానికొక పర్యాయం మహాసభ అధ్య క్షుణ్ణి ఎన్నుకోవాలి. ఒకేవ్యక్తి తన గుణగణాలనిబట్టి ఎన్ని మారులైనా ఎన్నుకోబడటానికి అర్హత కలిగివుండాలి. అత డొక అసాధారణ ప్రజ్ఞాధురీణుడైతే అతడికే యావజ్జీవి తమూ అధ్యక్షపదవి సమర్పిస్తూ వచ్చినా తప్పులేదు.

కాని కార్యనిర్వాహకవర్గ సభ్యులని మాత్రం అతడే నియమించాలి. వారినికూడ మహాసభ ఎన్నుకొనవలెననడం సంస్థయొక్క వ్యవహార దక్షతకి భంగకరం. ఎన్నిక పద్ధతిలో కార్యవర్గ సభ్యులు అన్ని విషయాలలో అధ్యక్షునితో ఏకీభ

వించక పోవచ్చు ; లేక వారిలో కొందరైనా అలసత్వంచేత తమ తమ విధులను నిర్వర్తించడములో అశ్రద్ధచేయవచ్చు. అటువంటి పరిస్థితిలో అధ్యక్షుడు నిస్సహాయుడై పోవడమే కాక మహాసభ వ్యాపారమంతా స్తంభించి పోవడంకూడా తటస్థిస్తుంది. దానికి బదులు కార్యవర్గ నియామకం విషయంలో సర్వాధికారాలూ అధ్యక్షుడికేవుంటే, అతడు తన దృక్పథంతో పూర్తిగా ఏకీభవించి, మనస్ఫూర్తిగా తనతో సహకారం చేస్తానని వాగ్దానం చేసిన వారినే నియమించు కొంటాడు ; వారిలో ఏమరుపాటు కనుపించినపుడు వారిని కార్యవర్గంనుండి తొలగిస్తాడు. ఈ పద్ధతిని మహాసభ కార్య నిర్వహణాని కంతటికీ అతడినే బాధ్యుణ్ణి చేయవచ్చు ; సంస్థ యొక్క వ్యవహారంకూడ ఎక్కువ కట్టుదిట్టంగా, చురుకుగా సాగిపోతుంది.

అధ్యక్షుడు తన కార్యవర్గ సభ్యులకు మహాసభా కార్య కలాపంలో ఒక్కొక్క శాఖ నప్పగించవచ్చు. వాటిలో రాష్ట్రేతరాంధ్ర, నిమ్నజాతి, మహిళా, ప్రచారక శాఖలకు విధిగా ఒక్కొక్క స్థానం వుండాలి. సాధ్యమైనంతవరకూ ఈ నాలుగు స్థానాలకు జన్మతః ఆయా శాఖలకు సంబంధించిన వారినే సభ్యులుగా నియమించే సాంప్రదాయం ఏర్పరచడంకూడ వాంఛనీయం.

(౨) మహాసభయొక్క శాశ్వత ప్రధాన కార్యాలయం బెజవాడలో. వుండాలి. అది మద్రాసులోకూడా

వుండవచ్చునన్న వాదనకి తావులేదు. తమిళ రాష్ట్రి కాంగ్రెసు కార్యాలయం మద్రాసులోవున్న కారణంచేత ఆంధ్ర కాంగ్రెసు కార్యస్థానంకూడా అక్కడేవుంటే వుండ వచ్చుగాక. కాని ఆంధ్రమహాసభ తమిళ రాష్ట్రీయ కాంగ్రెసు సంఘానికేవిధమైన పోటీసంస్థా కాదు. అందుచేత దాని ప్రధాన కార్యాలయం మద్రాసులో వుండవలసిన అగత్యమేమీ లేదు. కనుక అది ఆంధ్రరాష్ట్రంయొక్క ప్రాదేశిక కేంద్రమైన బెజవాడలో స్థాపింపబడటమే సముచితం. కాని దీనియొక్క సహాయ కార్యాలయాలు మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరులలో ఒక్కొక్కటి చొప్పున ఉండడముకూడ అవసరం.

బెజవాడ ప్రధాన కార్యాలయానికి ఒక స్వంత భవనమూ, వేతనంమీద పూర్తి కాలం పనిచేసే తగు మాత్రపు సిబ్బంది, వీటి పోషణ కవసరమైన ఒక శాశ్వత నిధీ, ఏర్పాటగుట అత్యవసరం. ఆంధ్రోద్యమంలో చిత్తశుద్ధితో చేయ దలచుకొన్నవారికి రాష్ట్రనిర్మాణానంతరంకూడ కావలసినంత పని వుంటుంది : ఒక విధంగా ఈ వుద్యమంయొక్క సరియైన పని రాష్ట్రం ఏర్పడినమీదటనే ఆరంభమవుతుందనికూడ చెప్పవచ్చు. ఆ పరిస్థితుల్లో, పూర్తికాలపు సిబ్బంది, ఇతర శాశ్వతపు ఏర్పాట్లూ లేక, కేవలం స్వచ్ఛంద సేవకులచేతనే ఈ పని అంతా నిర్వహింపబడడం ఊహింపరాని విషయం.

మహాసభ శాఖలు ప్రతి జిల్లా, తాలూకా, ఫిర్కాలకేగాక గ్రామ గ్రామానికీ పల్లె పల్లెకీగూడ వ్యాపించాలి. యావదాంధ్రదేశంలో మహాసభయొక్క సభ్యుడుగాని శాఖగాని లేని ఎంత చిన్న జనపదమైనా వుండకూడదు. ఈ ఆదర్శం అతి ప్రాథమికమైనప్పటికీ అతి ముఖ్యమైనది. మహాసభ సర్వవ్యాప్తమైన అంగనిర్మాణం పొందడంలో అనితర సాధ్యమైన శక్తి సంపాదించుకొంటుంది. ఈ ఆదర్శం పూర్తిగా ఆచరింపబడిననాడు మహాసభయొక్క సభ్యుల సంఖ్య లక్షలలో వుండడం నిశ్చయం.

(3) చలనంలేని అంగనిర్మాణం శిలావిగ్రహప్రాయమౌతుంది. కనుక మహాసభయొక్క శాఖాసముచ్చయం ఆంధ్రదేశమంతటా వ్యాపించినప్పటికీ, దానికి నిత్యమూ ఆచరణీయమైన ఒక కార్యక్రమవిధానం లేకపోతే దాని చైతన్యం బహుకాలం నిలవదు. ముఖ్యంగా సమావేశాల రూపంగా ఆయా శాఖల సచేతనస్థితి ఎప్పుడూ ప్రకటింపబడుతూవుండాలి.

మహాసభయొక్క సర్వసభ్యసమావేశం ఏడాదికొకసారి తప్పక జరిగితీరాలి. ఎంతటి అసాధారణ పరిస్థితులేర్పడినా, ఆంధ్రమహాజనులు ఈ వార్షిక సమావేశాన్ని ఒక అనుల్లంఘనీయమైన పవిత్ర నియమంక్రింద గుర్తించి, ఆచరించేటట్లు మహాసభ కృషిచేయాలి.

కార్యనిర్వాహకవర్గం కనీసం నెలకొక్కసారి, స్థాయి సంఘం నాల్గుమాసాలకొక్కసారి విధిగా సమావేశమవుతూ వుండాలి. ఆ సమావేశకాలంనాటి దేశపరిస్థితులను ఆంధ్ర మహాసభదృష్ట్యా పరిశీలించి, వాటివిషయంలో ఆంధ్రరాష్ట్రం ఏవైఖరి అవలంబించాలో ఎప్పటికప్పుడు ప్రకటిస్తూవుండాలి. శాఖాకార్యాలయాలకి తమ నిర్ణయాలను తెలియబరుస్తూ వాటికి మార్గదర్శకం కావాలి. అవిగూడ ఒక నిర్ణీతకార్య క్రమాన్ననుసరించి సమావేశమవుతూ, కార్యవర్గతీర్మా నాల కనుగుణ్యమైన పద్ధతిని బహిరంగ సభలూ, చర్చలూ మొదలైనవి తమ ఆధ్వర్యాన జరుపుతూవుండాలి.

ఎంత చిన్నగ్రామకార్యాలయమైనా నిర్ణీతకాలాని కొకసారి, ఏమీ ఇతర కార్యక్రమం లేకపోతే, కేవలం పతాకాభివందనానికైనా సమావేశమవుతూ వుండాలి.

మహాసభనాయకులు అవకాశం వచ్చినపుడల్లా తమ అభిప్రాయాలను వాఙ్మూలాల రూపంగానో లేక పత్రికాప్రతి నిధిసమావేశాలలోనో ప్రకటిస్తూవుండాలి.

ఈవిధమైన దేదో ఒక అంగనిర్మాణం, కార్యక్రమ విధానం నిర్ణయించి నిర్వహింపబడడం, మహాసభయొక్క ఉనికి సార్థకపడడానికి మూలాధారం.



# (౧౮) ఆంధ్రమహాసభ సంస్కరణ (౩)

మహాసభ ఒక వర్ధమానసంస్థ లాగ వుండడానికి దైనందిన విధులకు సంబంధించిన సామాన్యప్రణాళిక ఒక పునాదిరాయి అయినప్పటికీ, దానితో సంతృప్తిపడితే ప్రయోజనంలేదు. కాలానుగుణ్యంగా తను ముందడుగు వేసి, దేశాన్ని మెట్టుమెట్టుగా తనతో పైకెక్కించి, ఆంధ్రరాష్ట్రానికి భారతావనిలో ప్రథమస్థానం లభింపజేయాలంటే, అంతకన్న ఉద్ధృతమూ ఉత్తేజకరమూ అయిన ఒక పటిష్ఠ నిర్మాణకార్యక్రమం అవసరం. అది శాంతిసమయాలలో రాష్ట్రం సర్వతోముఖవికాసం పొందేటట్లూ, అవసరమైనపుడు సత్యాగ్రహంవంటి ఒక ధర్మయుద్ధానికి ఉపకరించేటట్లూ వుండాలి.

(౧) దాని శాంతిసమయ కార్యక్రమం ఒకటి రెండు పంచవర్ష ప్రణాళికల రూపంలో ఆరంభమవడం ఉత్తమం. అందులో ప్రథమసంవత్సరాంతం లోపునే, ఆంధ్రదేశమంతా మహాసభయొక్క శాఖావిస్తరణ పూర్తికావలె ననడం ప్రథమప్రణాళికయొక్క ప్రథమ అంశమై యుండాలి.

ఇదేవిధంగా ప్రణాళిక ఏఏ సంవత్సరానికి ఒక్కొక్క భాగంలో ఏఏవిధంగా ఎంతెంత కృషిసల్పబడాలో స్పష్టీకరించాలి. ఒక్కొక్క భాగమూ మహాసభాధ్యక్షుడి ఒక్కొక్క కార్యవర్గసభ్యునిపరం చెయ్యబడాలి.

ప్రతిఒక్క భాగమూ జయప్రదంగా నిర్వహింపబడడం ప్రణాళికయొక్క ఆచరణీయతమీద నేకాక, ఆ భాగానికి బాధ్యతవహించిన కార్యవర్గసభ్యుడి సహకారోత్సాహాలు మీదకూడ ఆధారపడివుంటుంది. ఉదాహరణకి ప్రణాళిక యొక్క వైజ్ఞానిక భాగం, ఒక నిర్ణీతకాలంలో ఆంధ్రదేశం యొక్క నిరక్షరాస్యతను తొలగించడం మొదలు ఆంధ్రవిశ్వ విద్యాలయం ప్రపంచదృష్టి నాకర్షించే స్థితికి వచ్చేవరకూ గల సమస్తవిషయాలను సమగ్రంగా చర్చించి, అందులో ఆంధ్రమహాసభ వల్ల నిర్వహింపబడవలసిన విధులెటువంటివో స్పష్టపరచాలి. ఈ భాగకార్యక్రమానికి నియోజితుడైన కార్యవర్గసభ్యుడు ప్రభుత్వవిద్యాశాఖాధికారులయొక్క, సమస్తవృత్తుల పరిశోధక మండలులయొక్క, కళోపాస కులయొక్క, వైజ్ఞానికసంబంధియగు ప్రతిసంఘముయొక్క తోడ్పాటును అర్థించి, ఆర్జించి, వలసిన సద్భావంతో వారి కెడతెగని పని కల్పించి, తమ ప్రణాళిక ప్రకారం ఆంధ్ర భూమి అభివృద్ధి పొందేటట్టు చూడడం అతని విధి.

ఇదేవిధంగా పారిశ్రామిక సభ్యుడు నిరంతర ప్రచారం వలన పెట్టుబడిదారులను ప్రోత్సహించీ, పారిశ్రామికుల నైక్యపరచీ, ప్రజా ప్రభుత్వాదరాభిమానాలను సంపా దించీ ఆంధ్రమండలాలలో మొదటి అయిదు సంవత్సరాలలో భారీపరిశ్రమల అభివృద్ధి తగినంత కనుపించేవరకూ తను నిద్రింపకూడదు! ఇంకొకరిని నిద్రింపనీయకూడదు! పడీ

పోయే ఆంధ్రపరిశ్రమల నుద్ధరించడానికీ, తెలుగు సీమలో అవతరించబోయే ఆంధ్రేతర పరిశ్రమలను న్యాయమైనంత వరకూ ఆటంకపరచడానికీ అతడు ఒళ్ళంతా కళ్లుచేసికొని చూస్తూవుండాలి. ప్రజానీకంలో ఎప్పటికప్పుడు మార్గదర్శక మైన ఆందోళనా ప్రచారాలను సాగిస్తూవుండాలి.

మిగిలిన కార్యవర్గ సభ్యులు కూడా తమతమ భాగ బాధ్యతలను ఇటువంటి ఏదో ఒక పద్ధతిని నిర్వహిస్తూ ఉమ్మడి మీద మహాసభ పేరిట ప్రతి సంవత్సరమూ కొన్ని ఘనకార్యాలు సాధింపబడేటట్టు చూడాలి.

(౨) లెక్కకు మిక్కిలిగా మహాసభ పంచవర్ష ప్రణాళికలు తయారు చెయ్యవచ్చు. కాని వాటిని పూర్తిగా ఫలప్రద మయేటట్టు ఆచరణలో పెట్టడానికి ప్రభుత్వం కూడా పూనుకోవాలి. మహాసభ ప్రణాళికలను అన్యపక్షీయు లేర్పరచిన ప్రభుత్వా లంగీకరించకపోవచ్చు, లేదా అమలు పరుపక పోవచ్చు. ఏమంటే, ఏ కాంగ్రెసో, కమ్యూనిష్టు పక్షమో రాష్ట్రంలో ప్రభుత్వాధికారం వహిస్తే, అవి ఉత్తరాది తాకీదులకు లోబడి వర్తించేవేకాని, స్వతంత్రించి ఆంధ్రప్రణాళికల ననుసరింప గల్గేవికావు. ఇల్లాగే సరిహద్దు సమస్యల్లోనూ, పరరాష్ట్రాలలో కేంద్రప్రభుత్వంలో ఆంధ్రులకు జరిగే అన్యాయాలలోనూ, పరప్రభావంలేని ఖచ్చితమైన ఆంధ్రదృక్పథం అవి ప్రదర్శించలేవు. అందుచేత

ఆంధ్రమహాసభ శాసనసభలు ప్రవేశించి ప్రభుత్వం నిర్వహించే సన్నాహంలో కూడా ఉండాలి.

ఇది బహు సంఖ్యాకులైన కాంగ్రెసు తత్వజ్ఞుల సమ్మతిపొందగల యోచన కాకపోయినా, ఈ వాదంయొక్క తర్కం మాత్రం నిరాక్షేపణీయం! ఏ జాతీయతను ఆదర్శంగా పెట్టుకొని కాంగ్రెసు సర్వత్రా ప్రభుత్వ నిర్వహణ కాండలో దిగుతున్నదో, దాని అనురూప ఆదర్శమైన రాష్ట్రీయతనే పరమ లక్ష్యంగా ఎంచుకొని మహాసభ శాసనసభా ప్రవేశం చెయ్యాలి.

శాసనసభలే కాదు, తనశక్తి విశ్వరూపం దాల్చవలెనంటే మహాసభ స్వయం పరిపాలనాధికారంగల పురపాలక సంఘాలవంటి అన్ని స్థానిక సంస్థలలోకూడ అడుగు పెట్టాలి! అప్పుడుగాని యావదాంధ్రాభీష్టాన్నీ ఏకకంఠంగా ప్రతటించడానికి గాని, ప్రభుత్వయంత్రంలో ప్రజాపరిపాలిత భాగాన్ని అవసరమైనంత వరకూ ఉపయోగించి వారి వాంఛితార్థాలని సాధ్యమైనంత సాధించుకొనడానికిగాని, వీలుండదు.

(3) ఒక్కొక్కప్పుడు పరిస్థితులు విషమించి సామోపాయాలన్నీ నిష్ఫలమై, పరుల దురాక్రమణకు మనం పాల్పడవలసి వస్తుంది. ఉదాహరణకి, "తెలుగు సీమలో చీలిక కోరడం కేవలం నిజాము దురాశే కాదు: బ్రిటిషు సామ్రాజ్యాధికారుల కుట్ర కూడాను" అన్న కొందరి అను

మానమే నిజమైతే, ప్రజాభిప్రాయాలూ శాసనసభా తీర్మానాలూ వట్టి కంఠశోషలు కాక మానవు. భారతభూమి బర్మాకి తిలోదకా లిచ్చినట్లు, నిజాము ప్రభువుకి ఆంధ్ర ఖండాన్ని కృష్ణార్పణ మనవలసి వస్తుంది.

శాసనసభలు కూడా నివారించ లేని ఇటువంటి పరిస్థితుల నెదుర్కొనడానికి ఒకేఒక మార్గముంది. అది, సత్యాగ్రహం లాంటి ఒక ధర్మయుద్ధంచేసి, న్యాయం కొరకు తమ అర్థమూ, ప్రాణమూ, సర్వస్వమూ ఆహుతి చేయడానికి సిద్ధపడిన ఒక స్వచ్ఛంద వీరవాహినిని దుర్భేద్య శిక్షణక్రింద తయారుచేయడం. ఆ శిక్షణ మన విశిష్టప్రజ్ఞకి నిదర్శనంగా, ఆ ధర్మయుద్ధం మన ప్రత్యేక పరిస్థితుల కనుగుణ్యంగా వుండాలి. ఎక్కడగాని పరాక్రమిత దేశాలు స్వాతంత్ర్యం సంపాదించుకొనడానికీ, మన దేశంలో కాంగ్రెసు ప్రస్తుత బలాధిక్యత పొందడానికీ, అంతిమ ఆయుధంగా ఇటువంటి సుశిక్షిత త్యాగమూర్తుల సైన్యమే సహాయపడింది. మన ఆంధ్రత్వ రక్షణకు కూడ చివరకదే శరణ్యమెందుకు కాకూడదు?

(౪) ఇక కడపటి విషయం. ప్రజలదృష్టిని ఏ వుద్యమం వైపైనా ఆకర్షించడానికి ఈ రోజుల్లో పత్రికల ప్రచార మనివార్యం. వాటికున్న శక్తి కూడ అపారం. అందుచేత ఇంత విస్తారమైన సన్నాహాని కంతటికీ తగు కట్టుబాటూ ప్రచా

రమూ వుండవలెనంటే, ఆంధ్రమహాసభ పేరిట కనీసం రెండు వారపత్రికలైనా,—ఒకటి తెలుగులో, ఒకటి ఆంగ్లంలో,— నడపబడడం అత్యవసరం.

కనుక సూత్రంగా, న్యాయమైన ఆంధ్రత్వ వికాసమే తన ఆదర్శమై, దానికి పూర్ణ మనస్కతతో కృషిచేయడమే తన సంకల్పమై యుంటే, ఆంధ్రమహాసభ ఇటువంటి ఏదో ఒక ధోరణిలో యోచించడం శుభావహం; యత్నించడం ముక్తిప్రదం.



# (౧౯) ప్రాంతీయత-జాతీయత

జాతీయత హృదయవైశాల్యానికి నిదర్శనం. ప్రాంతీయత సంకుచిత దృక్పథానికి మారుపేరు. రెంటికీ తెలుపు నలుపుల కున్న తారతమ్యం-అని లోకాభిప్రాయం.

కనుకనే శుద్ధ తెలుగురక్తం లోన ప్రవహించే నిష్కల్మషచిత్తులైన ఆంధ్రపుత్రులలో అధిక సంఖ్యాకులు రాష్ట్రోద్యమాన్ని త్రోసిరాజని క్రాంగెసు పతాకానికి సేవాంజలు లర్పిస్తున్నారు.

పైగా వారీవిధంగా కూడా మాట్లాడుతున్నారు :

''నీవు 'నేను మొదట ఆంధ్రుడను, తరువాత భారతీయుడను' అంటావు,

'స్వరాజ్యం వచ్చినా రాకపోయినా స్వరాష్ట్రం తప్ప' దంటావు,

'దానికి ప్రత్యేక నాయకత్వమూ, ప్రత్యేక స్వచ్ఛంద సైనిక దళమూ, ప్రత్యేక సత్యాగ్రహసమరమూ కావలె' నని ఉద్ఘోషిస్తావు,

''ఇది పాకిస్థాన్ నినాదంయొక్క ప్రతిధ్వని; మాతృగర్భవిచ్ఛేదనక్రియాకాండయొక్క పైశాచిక స్వరూపం!

''అందులో, రేపు కాంగ్రెసు ఆ చేతితో స్వరాజ్యం అందుకొనడమే తడవుగా, ఈ చేతితో మనకు స్వరాష్ట్రం

నిర్మించబోతున్నదామె! ఈ లోగా ఈ అనవసరాందోళన యెందుకు?

"లేదా, మనకు స్వరాజ్యం రానినాడు స్వరాష్ట్రం మాత్రమెందుకు? మన సర్వశక్తులూ కాంగ్రెసు చేయబోయే అంతిమ స్వాతంత్ర్య సమరంలో కేంద్రీకరించి భారత జాతీయతకై ధారపోయవలసిన పవిత్ర సమయంలో, భాషాప్రయుక్త రాష్ట్రోద్యమమన్న ఈ అప్రధాన ప్రాంతీయ సమస్యలను గూర్చి సందర్భ శుద్ధిలేని కోలాహలం చేయడం యెందుకు?

"ఇది కేవలం ఆత్మఘాతుక వికటాట్టహాసం." అని.

కాని వీరికి ప్రాంతీయోద్యమం యొక్క పరిభాష అర్థంకాలేదనే చెప్పాలి!

ప్రతి మానవ హృదయానికీ ప్రాంతీయత జాతీయత కన్న ప్రియతరమైన వస్తువు. ఇది ప్రకృతిసిద్ధం. ఎవ రెంత విపరీత విమర్శనలుచేసి మనోవైకల్యం కల్పించినప్పటికీ, ప్రతి ఆంధ్రుడి హృదయాంతరాళంలో 'నేను మొదట ఆంధ్రుడను, తరువాత భారతీయుడను' అనే నినాదం అంతరాత్మ ప్రబోధంలాగ మృదువుగా ప్రతిధ్వనిస్తునే వుంటుంది. బాహ్య పరిస్థితుల ప్రభావంవల్ల తాత్కాలిక చిత్తవిభ్రమం కలిగి, ఆంధ్రుడు ప్రస్తుతం అతీత జాతీయావేశ పూరితుడై యున్నప్పటికీ, కాలక్రమేణ ఈ పొంగు చల్లారి అతడు తన

వాస్తవిక ప్రకృతికి దూరకక మానదు. అప్పుడు 'నేను మొదట ఆంధ్రుడను' అనేశబ్దం ప్రతి కిశోరాంధ్ర హృదయానికీ పవిత్ర మాతృస్తన్యంలాగ అమృతోపమానమై రుచించక తప్పదు. ఇది అనివార్యం; అప్రతిబంధబంధితం. ఈ సృష్టి రహస్యాన్ని తిరస్కరించిగాని, తృణీకరించిగాని ప్రయోజనం లేదు,—అని ప్రతి జాతీయవాదీ ఎంత త్వరగా గుర్తెరిగితే అంత మంచిది.

'నేను మొదట ఆంధ్రుడ'నన్న నినాదంలో అసహజతే కాక అక్రమంగూడ ఎంతమాత్రమూ లేదు. విశ్వమానవ సౌభ్రాతృత్వం వాంఛిస్తూకూడ భారతస్వాతంత్ర్యానికి మన మెల్లా ప్రథమస్థానం యిస్తామో, భారత దాస్య విమోచనానికి యథాశక్తి తోడ్పడుతూ కూడ ఆంధ్రోద్యమ వికాసాని కగ్రపీఠ మర్పించడం ప్రతి ఆంధ్రుడి యొక్క గర్వింపదగిన కర్తవ్యం. నేను మొదట ఆంధ్రుడ ననడంలో భారతీయుడను కా ననే అర్థ మెక్కడా లేదు. నా ఆంధ్రత్వాన్ని క్రమవికాసం పొందనిచ్చే భారతీయత్వానికి యెప్పుడూ నేను జోహారు లర్పిస్తునే వుంటాను. కాలౌచిత్యాన్నిబట్టి, నా ఆంధ్రత్వశక్తినంతటినీ జాతీయతావికాసానికి అర్పించడంలో ఇతర ప్రాంతీయుల కెవ్వరికీ నేను తీసిపోను.

కాని, సత్యమైన జాతీయతా దేవాలయప్రాంగణంలో ఆత్మబలిదాన మొనర్చుకోనడం ఒకవిషయం; జాతీయతపేర

అన్యాయాక్రమణ చేసే పరరాష్ట్రశక్తులముందర ప్రణమిల్లడం యింకొక విషయం! ఆంధ్రులసొమ్ము పెట్టి ఇతర ప్రాంతాలలో ప్రాజక్టులు నిర్మించడం, అన్యరాష్ట్రీయుల పెట్టుబడులతో ఆంధ్ర దేశంలో పరిశ్రమలుస్థాపించడం, తెలుగు భాగాలను చీల్చి ఇతరులకు సంక్రమింపజేయడం, ఇత్యాది సందర్భమంతా జాతీయతానామంతో ప్రబలి వర్ధిల్లుతోంది. కాని వాస్తవానికి ఇదిజాతీయత కాదు. ఇది అంతర్ప్రాంతీయధర్మం యొక్క తులాభంగం. ఈ మృషాజాతీయత నెదుర్కోవడంలో మాత్రం 'నేను మొదట ఆంధ్రుడను' అన్న శస్త్రం యదార్థంగా, ఖచ్చితంగా ప్రయోగిస్తాను! భారతరాష్ట్ర సమాఖ్యలో నా ఆంధ్రత్వానికి సముచితస్థానం యిప్పించి రక్షించడానికి నా ప్రత్యేక నాయకత్వమూ, ప్రత్యేక స్వచ్ఛంద సత్యాగ్రహ బృందమూ మొదలైన వాటిని విధిగా ఉపయోగిస్తాను.

పరహింసా ప్రసక్తి లేక, కేవల మాత్మరక్షణ, ఆత్మోద్ధరణే పరమలక్ష్యంగాగల ఈ ఆంధ్రోద్యమాన్ని పాకిస్థాను ప్రయత్నంతో పోల్చడంకన్న రజ్జుసర్పభ్రాంతి ఇంకొకటి వుండదు.

''నాకు భారతభూమినుండి వేరుపడే తలపులేదు; సరికదా, అఖిలభారతదాస్యవిమోచనానికీ, దాని స్వాతంత్ర్య రక్షణకీ ఇతరులతోపాటు నా శక్తికొద్దీ కృషిచేస్తాను; కేంద్రంలో యేర్పడబోయే రాష్ట్రసమాఖ్యకై మిగిలిన

ప్రాంతాలు తమతమ స్వాధికారాల నెంతెంత త్యాగం చేయ గలవో అంత నేనూ చేస్తాను. కాని దీనిఅంతటికీ నా ఆంధ్ర త్వాన్ని మాత్రం చంపుకోలేను. భారతస్వేచ్ఛా సంపాదనో ద్యమంతోపాటు, నా ఆంధ్రత్వసర్వతోముఖ వికాసానికై, ఎప్పుడూ ఒక స్వతంత్రప్రయత్నం చేస్తూనే వుంటాను. దీనికి దాని నెన్నడూ అడ్డురానీను.'' అనడంలో పాకిస్థాన్ యొక్క పోలిక యెక్కడున్నదో పరమాత్ముడికే యెఱుక!

అసలు విషయ మేమంటే, ఆత్మవికాసం ద్వారా సంఘసేవ చేయనెంచే ఇటువంటి ప్రాంతీయ ప్రయత్నా లకూ, జాతీయతకూ, ఎన్నడూ వైరుధ్యముండదు. ఉప నదులు మహాస్రవంతిని వలె, నిర్దుష్ట ప్రాంతీయోద్యమాలు జాతీయతకి పుష్టి కలిగించేవేకాని, దానిశక్తిని క్షీణింప చేసేవికావు. ఏ అవయవం పూర్తి వికాసం పొందకపోయినా శరీరంయొక్క సౌష్ఠవశోభ కుంటుపడినట్లు, ఏప్రాంతం అభి వృద్ధియొక్క పరిపూర్ణతని అందుకోనకపోయినా జాతీయ ప్రతిభయొక్క సమృద్ధత లోపించిపోతుంది.

కాని జాతీయశక్తులకు శత ప్రతిశతి స్వాతంత్ర్యం ప్రాప్తించేవరకూ, ప్రాంతీయత నిద్రింపవలసిందేనా, లేక రెండునూ సమకాలికోద్యమాలుగా పోషింపబడవచ్చునా ?— అన్నది తరువాతి ప్రశ్న.

ఈ విషయంలో జాతీయవాదులు నివృత్తి సంశయులు!

కాని జాతీయతా ప్రాంతీయతలకి, దేహప్రాణాలకున్న పారస్పర్యముంది. ఒకదాని కింకొకటి పోషకశక్తి నిస్తుంది. కనుక అవి రెండునూ సమ ప్రాధాన్యత గలవి. అందుచేత జాతీయాదర్శం పూర్తిగా దేశంలో ఫలప్రదమైన పిదపనే ప్రాంతీయోద్యమాలకు ప్రాణప్రతిష్ట చేయవచ్చుననడం వితండవాదం. మానవనేత్రాల వలె అవి సమకాలిక వికాసం పొందడమే ప్రకృతి సమ్మతం!

అందుచేత ఏ ప్రాంతీయోద్యమ మైనప్పటికీ తగిన హద్దులలో ఆదరించి తప్పక ప్రోత్సహింపబడదగినది. అంతే కాని జాతీయతకు హృదయవైశాల్యత కల్పించి, ప్రాంతీయతకు దృక్సాంకుత్య మాపాదించడం అనుభవజ్ఞత అనుపించుకోదు.



# (౨౦) సమాప్తి

కనుక, నిష్పాక్షికదృష్టితో ఈ గ్రంథప్రతిపాదనను

విమర్శించి,

అవసరమైన, వలసిన సంస్కారణలతో దానిని సత్కా

రించి,

పిదప, దాని యథావిధాచరణానికి యథాశక్తిగా

ఉపక్రమించి,

రాష్ట్రనిర్మాణం ప్రాతిపదికగా గల ఆంధ్రోద్యమానికి

అనివార్యమైన

ఆంధ్ర మానసిక విప్లవానికి తోడ్పడి,

తెలుగుతల్లిని ధన్య నొనర్చగలరని,

ఆంధ్రమహాజనులకు వినయపూర్వకమైన విజ్ఞాపనము.

---

# అఖండ విజయవంతమైన-

## మరియొక ఘట్టము

## 1945 సం॥ లో

సమకూర్చబడిన వ్యాపారము - ఒక కోటీ 25 లక్షలు.

పట్టాలయిన వ్యాపారము - ఒక కోటీ 5 లక్షలు.



అద్వితీయమైన, రెన్యూయల్ ఖర్చుల రేటు - ఇట్టి లక్షణములతో దినదినాభి వృద్ధిగాంచుచున్న ఈ భీమా సంస్థ ప్రజా విశ్వాసమును జూరగొనినది.

ఏజెన్సీకి గాని, భీమాచేయుటకుగాని, వివరములకై వ్రాయుడు:—



# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని, లిమిటెడ్.

హెడ్డాఫీసు - మచిలీపట్టణము.

మా ఇతర ఆఫీసులు :—

మద్రాసు, కలకత్తా, నాగపూర్, లాహోర్, అలహాబాద్, జంషెడ్‌పూర్, బరంపురం (గంజాం), అనంతపురం, ఎర్నాకులం, శికింద్రాబాద్ (దక్కన్), బెజవాడ, గుంటూరు.

# నీల్ - కాల్ సిరాలు

ఫౌంటెన్ కలములకు ఉత్తమమైనవి

---

## మహాత్మా గాంధీగారు

నీల్‌కాల్ సిరాలను

నాలుగు పర్యాయములు మెచ్చుకొనియున్నారు.

---

మీ యభిమాన, ఆదరములను, పొందతగియున్నవి.

---

ఇట్లు విన్నవించు విధేయులు:

గుళ్లపల్లి రామకృష్ణయ్య

గొల్లపూడి సీతారామ శాస్త్రి

కళా పరిషత్, తెనాలి


8-3

# విజయ కమ్మర్షియల్ బ్యాంకు లిమిటెడ్.

హెడ్డాఫీసు :— బెజవాడ.

బ్రాంచీలు :— గవర్నరుపేట (బెజవాడ), నూజివీడు, మంగళగిరి, కొవ్వూరు (పశ్చిమ గోదావరిజిల్లా), ఏలూరు.

ది 30-4-46 తేదీన ఎక్కౌంటు స్టేటుమెంటు :

| | | | |
|---|---|---|---|
| చెల్లించిన మూలధనము క్షేమ నిధులు వగైరాలు. | 1,48,086- 3- 0 | చేతిలోను బ్యాంకులలోను నిల్వ. | 1,46,244-15- 4 |
| డిపాజిట్లు | 4,18,776-12- 2 | గవర్నమెంటు పత్రములు వగైరా | 84,956-14- 0 |
| | | అప్పులు. | 4,77,138-14- 6 |
| అనామతులు (బ్రాంచి ఎడ్జస్టు మెంటులు సహా) | 6,699- 6- 0 | స్టాంపులు, ఫర్నిచర్, స్టేషనరీ. | 9,630- 5- 3 |
| | | అనామతులు వగైరా | 12,344-11- 5 |
| బ్యాంకు జీవరు డ్రాఫ్టులు హుండీ మార్క్రములు. | 1,16,753- 7- 4 | వసూలువచ్చిన హుండీలు పోటీ. | 32,801-11-10 |
| వసూలువచ్చిన హుండీలు. | 32,801-11-10 | | |
| | 7,63,117- 8- 4 | | 7,63,117- 8- 4 |

(Sd.) మల్లెల సూర్యనారాయణ,

మేనేజింగు డైరక్టరు.

# FAMOUS FILMS CIRCUIT

Bombay, Madras, Nellore (H.O.) Bezwada, Guntakal.



## తయారైన చిత్రరాజములు



**హిందీ**

లైలా మజ్నూ

తారామతి

విలేజి గరల్

బాయ్

భామియా

మేఘదూత్



**తెలుగు**

సతీ తులసి

చిత్రనళీయము

బాలాజీ

ధర్మపత్ని

చంద్రహాస

కృష్ణప్రేమ

సారంగధర

హరిశ్చంద్ర

కాలచక్రం

మాయా మచ్ఛీంద్ర

నారద నారది

భాగ్యలక్ష్మి

వాల్మీకి



విడుదలకై నిరీక్షింపుడు :

పల్నాటి యుద్ధము ;

రాధేయ (కర్ణ) ;

శ్రీ చుండూరు వెంకటరెడ్డి, బి. ఎ; గారి

ప్రతిష్ఠాపనలు



ఆంధ్ర ఇంజనీరింగు కంపెనీ.



ఆంధ్ర వెజిటబుల్ ఆయిల్ ప్రాడక్ట్సు, లిమిటెడ్,



శ్రీ కనకాంబ పెయింటు & వార్నిష్ వర్క్సు, లిమిటెడ్.

శ్రీ కనకాంబ గ్రాఫైట్ సిండుకేటు.



శ్రీ కనకాంబ క్రోమైట్ సిండికేటు.



డైమండ్ మెషీనరీ మ్యాను ఫాక్చరింగ్ కంపెనీ.

శ్రీ కనకాంబ టెక్స్టైల్స్ : పాలకొల్లు,

యస్. ఆర్. ఆర్ & సి. వి. ఆర్. కాలేజి, బెజవాడ.



ఆంధ్రమహాశయుల ఆదరణాభిమానములను నిత్యము పొందుచున్నవి.



# భారత్ పిండిమర

## (BHARAT FLOUR MILL.)




1. ఈ పిండిమర నుపయోగించుట అతి సులభము.

2. చిన్న సైజు: తక్కువ బరువు: బల్లలకు, కుర్చీపీటలకు బిగించవచ్చును: ప్రయాణములు చేయునపుడు వెంటకొనిపోవచ్చును.

3. బియ్యము,గోధుమలు మొదలైన ధాన్యములనుండి, గంటకు 10,12శేర్ల నూకగాని, 5,6శేర్ల పిండిగాని తయారుచేయవచ్చును.

4. పెద్ద ఇంజనీర్లు కూడా ఈ పిండిమర గట్టితనమును ధృవపరచియున్నారు.

5. ప్రతి యింటను తప్పక ఉండతగిన ఆంధ్రనిర్మిత గృహోపకరణము.

*N.B* :—గృహోపయోగమునకు వీలైన వడ్లుబియ్యముగా చేయు మరకూడ మావద్ద తయారైనది.

## భారత్ మెకానికల్ వర్క్సు.

సోల్ ఏజంట్లు: ఆర్యస్థాన్ ఏజన్సీస్

బెజవాడ.

# THE ESWAR TRADING Co.,

**Machinery Merchants & Manufacturers' Representatives.**

CONVENT STREET, BEZWADA.

*Proprietor :* **M. K. RATNAM.**

*Stockists* : All sorts of spare parts for all types of oil Expellers.

*Dealers in :* Rice Mill Parts, Leather Washers for all types of hand & power water pumps.

*Direct Importers of* : Hair, Rubber, Leather & Cotton Beltings-Ball Bearings, Asbestas packings etc.,

*Agents for* : **THE TIDE WATER OIL CO., (INDIA) LTD.,** *for lubricating Oils & Greases Etc.,*





పుష్టి గల ఆహారం
అమరినా లేకున్నా,
మిమ్ము బలాఢ్యులనుగా చేసే





అమృత

సర్వదా అమరుతుంది
అమృత పుష్టినిచ్చే బలవర్ధకౌషధము

★ కేసరి కుటీరం లిమిటెడ్, మదరాసు ★

# సాక్షి వైద్యం, ఏలూరు

## వారి శాస్త్రీయ ఔషధ రాజములు

---

**శ్వాసకాసహారి :** దగ్గు, క్షయదగ్గు, కోరింతదగ్గు, కొండ నాలుక, ఉబ్బసము, పిల్లికూతలు, జలుబు మొదలగు వానిని రూపుమాపును. ఒక్కపూటలో గుణము—3 పూటల మందు ఉచితము.

**బలవర్ధని :** రక్తహీనత, నీరసము, దడ, వీటిని పోగొట్టును. జీర్ణశక్తిని, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును. ఏ జ్వరాంతమున సేవించినను రక్తపుష్టిని కలిగించును.

**బోదనిగ్రహ :** బోదకాలు, బోదచేతులు, బోదబుడ్డలే గాక శరీరమందే భాగమున కలిగిన బోదనైన నివారించును.



దొరకు స్థలము :

## రామా అండ్ కో

సకలవిధ గ్రంధముల వ్యాపారస్థులు.

ఏలూరు, గుంటూరు, రాజమండ్రి, భీమవరం, మద్రాసు.

*Telegrams* : **PHOENIX.**

# PHOENIX SYNDICATE

MERCHANTS, ENGINEERS & CONTRACTORS,

Park Road : BEZWADA.

మావద్ద యీ క్రింద నుదహరించిన ఇంజనీరింగు

సామానులు దొరకును :

ఆయిలు యింజన్లు,
స్టీము యింజన్లు,
బాయిలర్లు,
ఎలక్ట్రీ మోటార్లు,
డైనమోలు,
ఎలక్ట్రీ పంపుసెట్లు,
సినీమా ప్రొజక్టర్లు,
ఇతర సామానులు,
పొలముదున్ను
ట్రాక్టర్లు, మరనాగళ్లు,
వగైరా, వగైరా.

## ఫోనిక్సు సిండికేటు,

ఇంజనీరింగు మర్చెంట్సు,

పార్కు రోడ్డు : బె జ వా డ.

టెలిగ్రాఫు ఎడ్రసు : **PHOENIX.**

SELECT BEST OF ITS KIND.



# "PHILIPS" RADIOS.

FOR ITS QUALITY & PERFORMANCE.

AUTHORISED DEALERS & STOCKISTS :

## CENTRAL THEATRE SERVICE.



*Dealers in :—*

Radios,

Amplifiers,

Public address Systems,

Cinema equipments &

SPARES FOR ALL.

SERVICING OUR SPECIALITY.

Near Maruthi Cinema, BEZWADA.

# ఆంధ్రమ్యానుఫాక్చరర్స

# అసోసియేషన్.

బిసెంట్ రోడ్ : బెజవాడ.

---

ఆంధ్ర పారిశ్రామికులకు అన్నివిధముల

తోడ్పడు సంస్థ

---

అధ్యక్షుడు :

ఆర్. కె. యన్. గజపతిరాజు

స్త్రీకి సంతానం సహజమైన కోరిక





# లోధ్ర



దానిని సఫలత నొందిస్తుంది

లోధ్ర అంతటా దొరుకును

కేసరికుటీరం లిమిటెడ్.
మదరాస్





★ అన్ని విధములైన వ్యాపారములలో

★ మీ వాటాలు అమ్మదలచినను, కొనదలచినను, మాకు వ్రాయండి!

★ నమ్మకమైన సలహా, సరసమైన షరతులు.

ఆంధ్ర షేరు బ్రోకర్లు,
బిసెంటు రోడ్డు, బెజవాడ.

# శ్రీ లక్ష్మీ జ్యూయలరీ, కంపెనీ

బెజవాడ.

అత్యంత నవనాగరిక ఆభరణములకు, నవరసు బంగారమునకు, చాందీ వెండికి, 25 ఏండ్లనుండి ఆంధ్రదేశమున ప్రఖ్యాతివహించిన అద్వితీయ సంస్థ.



ఒక్కసారి ప్రయత్నించిన మీకే విశ్వాసము కలిగి, మీ మిత్రులకుగూడ మా నగలను శిఫారసు చేయగలరు.

ప్రొప్రయిటరు:

## యెర్నేని లక్ష్మీనారాయణ చౌదరి,

ప్రధాన కార్యస్థానము:
శ్రీ లక్ష్మీమహాలు,
19/105, గాంధీనగరము.

బ్రాంచి:
11/264, శివాలయం వీధి,
బెజవాడ.

# ది ఆంధ్రఫార్మస్యూటికల్ వర్క్సు, లిమిటెడ్

## రామవరప్పాడు (బెజవాడ).

ఇంజెక్షన్లు, ఔషధములు, రసాయనములు మొదలైనవి తయారుచేయువారిలో మద్రాసు రాజధానియందు అగ్రగణ్యులు.

గవర్నమెంటు, సివిల్, మిలిటరీ ఆస్పత్రులకు సరఫరాదారులు.

తమ పోషకులకు, షేరుహోల్డరులకు, ఖాతాదారులకు తమ అసమానాభివృద్ధిని విశదపరచు ఈ క్రిందివిషయములను ప్రకటించుచున్నారు.

| | | | |
|---|---|---|---|
| 1940-41 | మొత్తం అమ్మకములు | రు | 56,428 |
| | మూలధనము | రు | 54,125 |
| | నికరాదాయము | రు | 6,510 |
| | డివిడెండ్లు | 6% | |
| 1941-42 | మొత్తం అమ్మకములు | రు | 76,650 |
| | మూలధనము | రు | 97,375 |
| | నికరాదాయము | రు | 8,782 |
| | డివిడెండు | 7% | |
| 1942-43 | మొత్తం అమ్మకములు | రు | 1,29,865 |
| | మూలధనము | రు | 1,59,030 |
| | నికరాదాయము | రు | 17,913 |
| | డివిడెండు | 7½% | |
| 1943-44 | మొత్తం అమ్మకములు | రు | 1,86,871 |
| | మూలధనము | రు | 1,85,600 |
| | నికరాదాయము | రు | 13,650 |
| | డివిడెండు | 6% | |
| 1944-45 | మొత్తం అమ్మకములు | రు | 1,68,553 |
| | మూలధనము | రు | 2,85,035 |
| | నికరాదాయము | రు | 14,195 |
| | డివిడెండు | 6% | |

45–46 లో మొత్తం అమ్మకము, 300000 దాటినది.

మానేజింగ్ డైరెక్టరు

# ఆంధ్రబ్యాంకు లిమిటెడ్

స్థాపితము: 1923.

హెడ్డాఫీసు: మచిలీపట్టణము.

అధికారము పొందబడిన మూలధనము: ఒకకోటి రూపాయలు.

చందావేయబడి, జారీచేయబడిన మూలధనము: ఇరువదిలక్షలు.

చెల్లింపబడిన మూలధనము: పదమూడులక్షలు.

రిజర్వుఫండు: రెండులక్షలు.

డిపాజిట్లు: రెండుకోట్లు, ఇరువదిరెండులక్షలు.

అమలులోనున్న వ్యాపారము మొత్తము: మూడుకోట్ల రూపాయలు.

బ్రాంచీలు, సబ్ ఆఫీసు:

మదరాసు: బాంబే మ్యూచియల్ బిల్డింగు., 378, ఎస్ప్లనేడు.

సికిందరాబాదు: మెహతామహల్, జేమ్సువీధి.

మచిలీపట్టణము, నెల్లూరు, తెనాలి, గుంటూరు, బెజవాడ, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్టణము, విజయనగరము, బరంపురం (గంజాం), ఒంగోలు, చీరాల, దుగ్గిరాల, నరసారావుపేట, వినుకొండ, బ్రాడీపేట (గుంటూరు), గవర్నరుపేట (బెజవాడ), గుడివాడ, పాలకొల్లు, భీమవరం, సామర్లకోట, రామరావుపేట (కాకినాడ), పిఠాపురం, తుని, అనకాపల్లి, శ్రీకాకుళం (విశాఖ).

ఫిక్సెడ్ డిపాజిట్లు అన్ని బ్రాంచీలలోను తీసుకొనబడుచున్నవి.

3 సం॥ ల క్యాషు సర్టిఫికెట్లు, యీ బ్యాంకులో ప్రత్యేక సౌకర్యము.

అన్నిరకముల చెక్కులు, డ్రాఫ్టులు, డివిడెండు వారంట్లు, హుండీలు, వసూలు చేసి పెట్టబడును.

గవర్నమెంటు పత్రములు, షేర్లుకొనుట, అమ్మట మొదలగు వ్యాపారములు కూడా చేయబడును.

వివరములే ఆఫీసులోనైనను తెలిసికొనవచ్చును.

వారణాశి కృష్ణమూర్తి.

ఎం. ఏ; బి. కాం; యల్. యల్. బి; ఎ. ఐ. ఐ. బి.,

జనరల్ మేనేజరు.

# అభ్యుదయ ఫిలిమ్స్

సుభద్ర మాన్షన్సు :

రాయపేట : మద్రాసు.



నూతన తెలుగు చిత్రము

?

చలనచిత్ర చరిత్రలో అపూర్వశోకము !

దీప్తివంతమైన వర్తమాన రాజకీయగాథ !

దేశాభ్యుదయానికి మంగళాశీస్సు !



ప్రొడ్యూసర్:

వి. పూర్ణచంద్రరావు.

పెయింట్లకు వార్నిషులకు



జ్యోతి పెయింట్ & వార్నిషు ఇండస్ట్రీసు

మద్రాసు, 10

---

సర్వజనా మోదమునందిన

ఆంధ్ర సంస్థ.








లివర్ & స్ప్లీన్ వ్యాధుల
చే బాధ పడుచు, యితర
ఔషధములచే నివారింప
బడజాలని శిశువులు వేలకొ
లది, యీ అద్భుత ఔషధ
రాజముచే రక్షింపబడిరి.

జమ్మి వెంకట-
రమణయ్యగారి

# లివర్ క్యూర్

జమ్మి వెంకటరమణయ్యగారి 'లివర్ క్యూర్' ప్రఖ్యాతిగాంచిన వైద్యులు దీనిని వైద్య శాస్త్రములోకెల్ల నొక విజయోత్సవముగా శ్లాఘించుచున్నారు.

అందరి కెమిస్టుల వద్ద దొరుకును; లేనిచో క్రింది విలాసమునకు వ్రాయుడు.

**జమ్మి వెంకటరమణయ్య & సన్సు,**
1/1, బ్రాడీస్ రోడ్డు, మైలాపూర్, మద్రాసు.

ఇంకను: బొంబాయి, కలకత్తా, లక్నో, బెంగళూరు, తిరుచినాపల్లి విజయనగరములందు కూడ ఆఫీసులు గలవు.

# శ్రీ గోకుల్ మహల్



26, దేవరాజ మొదలి వీధి,

పార్కుటౌన్, మద్రాసు.



ఆంధ్రులకు చెన్నపట్టణములో
ప్రత్యేక, భోజన, విశ్రాంతి
భవనము.



ప్రొప్రైటర్:

వి. పూర్ణచంద్ర రావు.

# ఇండియన్ ఛేంబర్ ఆఫ్
# ఇండస్ట్రీస్ & కామర్స్

పార్కు రోడ్డు : బెజవాడ.

ఇండియన్ కంపెనీస్ ఆక్టు ననుసరించి రాష్ట్రీయ
ప్రభుత్వానుమతితో స్థాపింపబడినది.



కేంద్రప్రభుత్వ వాణిజ్య విద్యాశాఖల ఆమోదముతో
ప్రభుత్వ ప్రకటనలు పొందుచున్నది.



ఆంధ్రదేశమందలి వర్తమాన, నూతన, పరిశ్రమలకు
అన్నివిధముల తోడ్పడును.



అధ్యక్షులు :

శ్రీ రాజా వెలుగోటి సర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్ర
బహద్దరువారు, M. L. A., వెంకటగిరి మహారాజా

ఉపాధ్యక్షులు :

శ్రీ చుండూరి వెంకట రెడ్డి, B. A;
శ్రీ రాజా M. R. అప్పారావు బహద్దరు, M. A;
దివాన్ బహదూర్ బి. రామచంద్రా రెడ్డి, C. B. E;

కార్యదర్శి :

శ్రీ తుమ్మలపల్లి సీతారామారావు.